శ్రీః

# కన్నకూతురు

(సాంఘికనాటకం)



రచయిత

ఆముజాల నరసింహమూర్తి
హిందీ ప్రచారక్
తోటేరు.

1957

శ్రీః

# కన్నకూతురు

(సాంఘిక నాటకం)

రచయిత

ఆముజాల నరసింహమూర్తి
హిందీ ప్రచారక్
తోలేరు.

1957



[వెల రు 2-0-0

ఈ నాటకము శేంబరదీవి పౌరుల ధనసహాయమున అచ్చొత్తింపబడినది.

# హెచ్చరిక

నా లిఖితపూర్వకమైన అనుమతిలేనిదే నాయీ నాటకాన్ని యే నాటక నిర్వాహకులు, యే నటీనటులు ప్రదర్శింపరాదు ఎవరు స్క్రీన్ చేయరాదు. రేడియో బ్రాడ్ కాష్టింగు, రికార్డింగు చేయరాదు. భాషాంతరీకరణము చేయరాదు. ముద్రింపరాదు. పైవానికి వ్యతిరేకంగా ప్రవర్తించినవారు నే జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

ఇట్లు,

ఆముజాల నరసింహమూర్తి.

## మాతృశ్రీకి అంకితము



శ్రీయుతసచ్చరిత్రయు, వశిష్ఠసగోత్రయు, నాముజాల నారాయణ ధర్మపత్నియు, జనాదృతిపాత్రయు, నైనయట్టి నిర్మాయకు, నచ్చమాంబికకు, మాజనయిత్రికి, నంకితంబుగా నాయనుఁగుంగుమారిత యనందగు నీకృతినిత్తుభక్తిమై.

# ఆశీస్సు

శ్రీ కవిసార్వభౌమ ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవి
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

కన్నకూతురు — ఇదియొక సాంఘిక నాటకము. తన కన్నకూతురిని తండ్రి తానే పెండ్లియాడుటకు ప్రయత్నించుట ప్రధానము చేసికొని యిది రచింపఁబడినది.

నేటిజనుల అభిరుచినిబట్టి కాలము ననుసరించి యిది వ్రాయఁబడినది. ఇందు వృద్ధుఁడయిన శ్రీహరిరావు రెండు వివాహములు చేసికొని విషయవాంఛా తృప్తుఁడు కాకపోవుటయే కథాంశము.

కథానాయకుఁడైన అమర్‌నాథ్ ఆరావునకు మేనల్లుఁడు. గొప్ప ధనవంతుని బిడ్డయై బాల్యమందే తల్లిదండ్రులను గోల్పోయి మేనమామయింట పెరిగినవాఁడయ్యెను.

శ్రీహరిరావు ద్వితీయభార్యతో చెలికత్తెగా తనయింటికి వచ్చిన సత్యవతినికూడా గాంధర్వవిధిని వివాహమై తుదకేదో దుర్బుద్ధివలన గర్భవతియైన యామెను పుట్టింటికి పొమ్మని కాదనఁగా చంపుటకుకూడా ప్రయత్నముచేసెను. పాప మామె తప్పించుకొని యెట్లో యొక స్వామి ఆశ్రమముఁజేరి బిడ్డను కనినది. ఆబిడ్డ ధర్మయ్యయను రైతునింట పెరిగినది. ఆమెయే కథా

నాయిక. పేరు ప్రభావతి. రాఘ్ను ఆ ప్రభావతినిగూడా చతుర్థ వివాహము చేసికొనఁదలచి తుదకు తన కన్నకూతురని తెలిసి కొని పశ్చాత్తప్తుఁడయి తన మేనల్లుఁడు కథానాయకుఁడునైన అమర్‌నాథుని కిచ్చి పెండ్లి చేసినాడు. ఇదియే యిందలికథ.

ఇప్పటివారి అభిప్రాయానుసారముగా నిట్లు కథ కల్పింపఁబడినది. కాని నాటక నియమములు స్వీకరింపఁబడలేదు.

ఈ నాటకము నాటక రంగమునకు సినీమారంగమునకు కూడా మనోరంజకముగా నుండుననుటకు సందేహము లేదు.

ఈ గ్రంథకర్త శ్రీ ఆముజాల నరసింహమూర్తి కవి ఇతోధికముగా నభ్యుదయ రచనలను చేయుచు ప్రజల మన్ననలకుఁ బాత్రుఁడై సుచిరాయు రుదారవైభవమ్ముల నలరారు గాత.

ఇట్లు
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ఆస్థానకవి.
రాజమండ్రి.
10—10—57

శ్రీః



## నటరాజస్తవం.

శ్లో॥ శ్రీసత్కళావిలసన ప్రభవాయ లోకే
సృష్టిస్థితి ప్రళయనిర్వహణాధిపాయ
శ్రుత్యాద్యబోధ్యమహిమాన్విత రూపభాజే
తస్మై నమోఽస్తు నటరాజవరాయ నిత్యమ్.

# పాత్రపరిచయం

1. శ్రీహరిరావు.... వయస్సు 50 సం॥ కథానాయకుని మేనమామ దేవాలయ ధర్మకర్త. విషయ సుఖాభిలాషి. గణపతిచేతి కీలుబొమ్మ.
2. గణపతి.... వయస్సు 40 సం॥లు దేవాలయపు గుమస్తా. పాపభీతిలేని తాతికవాడి. ఎక్కువగా మాటాడువాడు.
3. అమర్‌నాథ్.... వయస్సు 8 సం॥ నుంచి 22 లోపు కథానాయకుడు. సర్వజనహితైషి. నిస్వార్థపరుడు. నిరాడంబరజీవి.
4. ధర్మయ్య.... వయస్సు 60 సం॥ లోపు. శ్రీహరిరావు రైతు. కథానాయిక పెంపుడు తండ్రి. బ్రతికి చెడ్డవాడు.
5. భాస్కరరావు.... వయస్సు 22 సం॥లు అమర్‌నాథుని మిత్రుడు యువజన సంఘ కార్యదర్శి. ధర్మయ్య కుమారుడు. నిర్మొగమాటంగా మాట్లాడువాడు.
6. దయానందస్వామి.... వయస్సు 50 సం॥లు సర్వోదయ సమాజాశ్రమాధిపతి, సంస్కారి.
7. డాక్టర్.... వయస్సు 30 సం॥లు ఆశ్రమవైద్యుడు ఇంగితజ్ఞానంగల విశాల హృదయుడు.
8. సత్యవతి.... వయస్సు 15 సం॥లు కథానాయికకన్నతల్లి. ఆదర్శ సాధనానికై ఆత్మార్పణం చేసిన అఖండ ప్రజ్ఞావతి.
9. ప్రభావతి.... వయస్సు 18 సం॥లు శ్రీహరిరావు కన్నకూతురు. కథానాయిక సంఘనిర్ణయాన్ని ఆత్మత్యాగంచేసి సంస్కరింపదలచిన సాధ్వీమణి.

శ్రీః

# కన్న కూతురు

## [ ప్రథమ దృశ్యం ]

[శ్రీహరిరావు గారి మేడ, సత్యవతిగది, రాట్నం వడుకుతున్న గాంధీ గారి చిత్రపటం, దాని కిరువైపుల పూజాపరికరాలు. డ్రాయరుమీద చిన్న గడియారం, వెలిగించినలైటు. కొంచెందూరంగా రెండుకుర్చీలు. గోడకు చాలరకాల ఫొటోలు ఉండును.]

సత్యవతి : (ఫలాహారపు పళ్లెంతో ప్రవేశించి, యిటు నటు చూచి) చినబాబు! ఓచినబాబు! ఇంకా నీపన్లు పూర్తి కాలేదా? (పళ్ళెం క్రిందపెట్టును)

అమర్ : (ప్రవేశించి) అయ్యో యత్తాయి! ఈ వేళకూడా మనం ప్రార్థన చేయాలా?

సత్య : ఈవేళేమిటి? రోజూచేయాలి బాబు !

అమర్ : ఇలా పూజలు, ప్రార్థన్లు చేయుడమెందుకు చెప్పు?

సత్య : ఎందుకేమిటి? మహాత్ముల్ని పూజించి ప్రార్థించడం మనకర్తవ్యం.

అమర్ : గాంధీతాత మహాత్ముడా? అత్తాయి!

సత్య : కాదుమరి?

అమర్ : మహాత్ముడంటే! దేవుడితో సమానుడా?

సత్య : సమానుడేమిటి? సాక్షాత్తు దేవుడే!

అమర్ : దేవుడయితే! మనంకోరిన కోర్కెల్ని నెరవేరుస్తాడా ?

సత్య : నెరవేరుస్తాడు. చినబాబు! మహాత్ముని ఎదుట నే చెప్పి నట్లు తలవంచి నిలబడాలి.

అమర్ : నిలబడి ?

సత్య : చేతులు జోడించి "మహాత్మా! నీ శారీరికమానసిక శక్తుల్ని నాకు కూడాయిచ్చి, వాక్కాయకర్మలతో, దేశసేవచేసే వాణ్ణిగా, చేస్తూ, ఆయురారోగ్య భాగ్యా లు, యిచ్చినన్ను కాపాడు"అని భక్తితో, ప్రార్థించాలి.

అమర్ : ప్రార్థిస్తే?

సత్య : నీవడిగినవన్నీ యిస్తాడు.

అమర్ : (సంతోషంతో) నిజమా? అత్తాయి!

సత్య : నిజమే! చినబాబు!

అమర్ : అయితే! గాంధీతాతకూడా రాముడు, కృష్ణుడులాంటి గొప్పదేవుడన్నమాట కదూ?

సత్య : కాదుమరి! అలాంటి అసమానశక్తిశాలి కాకపోతే హైడ్రోజన్‌శక్తి నధిగమించిన తన అహింసాయుధంతో, అనాయాసంగా, ఆంగ్లేయుల్ని, అగ్గిబోటులెక్కించి, ఆవలకు పంపించగలడా? మనకు సంపూర్ణ స్వపరిపాల నాధికారాన్ని సంపాదించి, యివ్వగలడా? చెప్పు.

అమర్ : అయితే! అంతశక్తిగల గాంధీతాత రాట్నంవడుకుతూ కష్టపడవలసిన, కారణమేమి టత్తాయి!

సత్య : కారణం చెబుతే! నీవుకూడా రాట్నం వడుకుతావా? మరి?

అమర్ : ఓ! తప్పకుండా వడుకుతా నత్తాయి!

సత్య : అయితే! చెబుతా విను.

సీ॥ దారిద్ర్యగాంధ్రాంధ, కారంబుఁ, బాపంగ
రాజీవమిత్రమీ, రాట్నమె కద!
తంతునిర్మాణ యంత్రాలయోద్ధతి, మాన్ప
బ్రహ్మాస్త్రరాజ, మీ రాట్నమె కద!
స్వజనవియోగాగ్నిఁ, జల్లార్పఁగా, మనో
రంజకబంధువీ, రాట్నమె కద
దుర్బలత్వంబును, దొలఁగింపనౌషధ
రాజంబు, వశ్యమీ, రాట్నమె కద!
తే॥ కదురు తిరిగినఁ గర్వంబు కదలుచున్న
లేమియనుమాట లేశంబు లేకయుండు,
నానెడు నూ_క్తిని, సర్వులు, నొదలఁ గొని
నిత్యమున్ దత్పరిశ్రమ, సెరప, వలయు.

అని వడికేదు. తెలిసిందా? చినబాబు!

అమర్ : అయితే! రేపటినుంచి నేనుకూడా రాట్నం వడుకుతా నత్తాయి!

సత్య : రాట్నంవడికి నీవుకూడా గాంధీతాతలా ప్రపంచానికి ఆపన్నుడవు కావాలి(గడియారం చూచి)అబ్బా! అప్పుడే యేడున్నర దాటింది ప్రార్థన మొదలుపెడదామా?

అమర్ : ఓ అయితే! ఆలస్యమెందు కత్తాయి!

సత్య : (అగరువత్తులు వెలిగించి అర్ధనిమీలిత నేత్రయై, గాంధీ ఫోటో, యెదుట, నిలబడి, చేతులు, జోడించును)

అమర్ : (ప్రక్కన నిలబడి సత్యవతి ననుకరించును)

దండకం

శ్రీమత్కరమ్ చందుగాంధీ! స్వకీయాద్భుతోద్యన్మహాశక్తి సంతోషి. తాత్మీయ సంబంధి! హిందూ ముసల్మానమ్మ తాంభోధి సంధాన కార్యైక పానీయసంధీ! జగత్ స్తుత్య గాంభీర్యకంధీ! సమస్త ప్రపంచైక బంధూ! సుధీలోక పూర్ణేందు! సర్వప్రజాదాస్య విచ్ఛేదకప్రద్రాజకీయో త్తమ జ్ఞానసింధూ! భవత్తుల్యులెవ్వారు? సత్యవాక్పాలనా మోఘ సచ్ఛాంత్య హింసాదయాస్వశ్యతా వారణ త్యాగశౌచామలస్వాంతుఁ డీవైయెదు ఖండంబులన్ మున్ను జన్మింపలేదంచు ముందైన జన్మింపఁబోడంచుఁ జేయెత్తి వాక్రుచ్చెదన్ ధర్మసంస్థాప నార్థంబు నారాయణాంశంబునన్ భారతాంబామణీ పుత్రరత్నంబవై పుట్టియన్యాధి పత్యాంతి సంబాధిత స్వీయదేశీయ దారిద్ర్యగాఢాంధకారంబు నిర్మూల నంబుం బొనర్పంగ సత్యాగ్రహో పూర్వ దివ్యాస్త్రి సంధానమున్ జేసి చేయించి యెవ్వారికిన్ లేశమాత్రంబుఁ గష్టంబు నష్టంబు లేకుండఁ బ్రత్యర్థులన్ నౌక లెక్కించి సంద్రంబు దాటించి దేశైక సౌభాగ్యసంధాన ధౌరేయులౌ భవ్య

రాజేంద్ర పట్టాభి నెహ్రూ పటేల్ టంగుటూరి ప్రకాశాది విద్వజ్జనస్కంధ పీఠంబులన్ శాసనోద్ధారమున్ మోపి శాంత్యుత్సవదేశంబులన్ జేయుచున్ సర్వదేశాల కాదర్శనీయుండవై యుండి దిఙ్నాగవేదాత్మ భూచంద్ర మోబ్దంబునన్ (1948) దేహాలీవర్తనం బందు సభ్యాళితోఁ గూడి శ్రీరామ నామస్మృతిన్ జేయుచున్ దుష్ట గోడ్సే మతోన్మాది దుర్మారణాస్త్ర ప్రహారంబుచే నేలపై వ్రాలి ప్రాణంబులన్ బాసి సత్కీర్తి కాయుండవైనావు కాల త్రయాదర్శమూర్తీ! సుధీచక్రవర్తీ! జగత్పూర్ణకీర్తీ! నమస్తే నమస్తే నమస్తే నమః.

"వైష్ణవజనతో తేనేకహీయె జే
పీడపరా ఈ జాణేరే;
పరదుఃఖే ఉపకార కరేతోయే
మన అభిమానన ఆణేరే.
సకలలోకమాం సహునే వందే
నిందానకరే కేనీరే
వాచకాఛమన నిశ్చలరాఖే
ధనధనజననీ తేనీరే
సమదృష్టినే తృష్ణా త్యాగీ
పరస్త్రీ జేనే మాతరే
జిహ్వాథకీ అసత్యనబోలే

పరధన నవర్షూాలే హాథ్ రే
మోహామాయా వ్యాపే నహీంజేసే
దృఢవైరాగ్య జేనామనమాంరే
రామనామశుం తాలీలాగీ
సకలరథతేనా మనమాంరే
వణలోభీనే కపటరహితఛే
కామక్రోధని వార్యా రే
భణే నరసైంయో తేనుం దరసనరకతాం
కులయేకో తేర్ తార్యారే॥"

సత్య : (సాష్టాంగనమస్కారంచేసి) మహాత్మా! మా అమర్ నాథుని ఆశీర్వదించి నిత్యం నీలోని, శమదమాది, సద్గుణాల్ని, ప్రసాదిస్తూ, నీలా, శాంతిదూతగా, తయారు చేయి, తండ్రి! (ఫలాహారం కళ్ళనద్దుకుని అమర్‌నాథునికి పెట్టి, తాను కొంచెంతిని) ఏదీ? చినబాబు! నిన్న చెప్పిన పద్యం ఒకసారి అను.

అమర్ : (అనును)

ఆ॥ తెలియనట్టివానిఁ దెలియఁజేయఁగవచ్చు
దెలిసినట్టివానిఁ దెలుపవచ్చు
తెలిసి తెలియనట్టి ధీదుర్విదగ్ధునిఁ
దెలియఁజేయ వశమె? నలువకైన.

సత్య : శెభాశ్! చక్కగా అన్నావు నాయనా!

అమర్ : క్రొత్తపద్యం ఇంకొకటి యిప్పుడు చెప్పతావా? అత్తాయి!

సత్య : రేపు ఉదయం చెబుతాలే!

అమర్ : (గోడకు తగిలించివున్న ఫోటోలుచూచి) ఈ ఫోటో, లెప్పుడు, తెప్పించావత్తాయి!

సత్య : ఈ పూటే వచ్చాయి! బాగున్నాయా?

అమర్ : (సమీపించి) ఓ ! చాలబాగున్నాయి ! వీరెవరవ రత్తాయి!

సత్య : (వ్రేలితో కనపరస్తూ) ఇతడు హరిశ్చంద్ర చక్రవర్తి. ఇదిగో ! యీమె ఆసార్వభౌముని పట్టమహిషి చంద్రమతీదేవి. చూడు ! యీపడివున్న పిల్లవాడు, వీరి యేకైక, పుత్రుడు లోహితాస్యుడు!

అమర్ : వీరందరు యిలావున్నారేం అత్తాయి !

సత్య : అబద్ధం ఆడలేదనే, ఆగ్రహావేశంతో, మహారాజని వెనుదీయక యీహరిశ్చంద్రుడు నొకమాలవానికి అమ్మించి, మహారాణి అని జంకక యీ సాధ్వీమణిని ఒక బ్రాహ్మణునికి దాసిగా యిప్పించి, కొడుకు నొక ఘోరారణ్యంలో పాముచే కరిపించి, విశ్వామిత్రుడు వీరిని ఇన్ని యిబ్బందులు పెట్టేడు.

అమర్ : పాపం ఎన్ని బాధలు పెట్టేడు ?

సత్య : కాని! హరిశ్చంద్రుడు అవన్నీ సహించి, చివరకు, తన సత్యవ్రతాన్ని, సార్థకం, చేసుకుని, సత్యహరిశ్చంద్రుడు అనిపించుకున్నాడు.

అమర్ : (వ్రేలితో కనకపటం) వీరెవరత్తాయి !

సత్య : ఇతడు శ్రీరామచంద్రమూర్తి. బాల్యంనుంచి పరాక్రమశాలిగా ప్రవర్తిస్తూ.

అమర్ : ఊఁ ప్రవర్తిస్తూ !

సత్య: పట్టాభిషేకంమాని తండ్రిగారి ఆజ్ఞ ప్రకారం భార్యతోను తమ్మునితోను కలిసి ఆనందంగా అరణ్యవాసం చేసేడు. కోతుల సహాయంతో సముద్రానికి గట్టువేసి లంకలోని రావణాది రాక్షసుల్ని రణరంగంలో చంపి, సమస్త లోకాలకి శాంతి సౌఖ్యాలు సమకూర్చేడు.

అమర్ : అలాంటి మహాకార్యాలు చేసిన అవతారమూర్తి గనుకనే శ్రీరామచంద్రుని అందరు పూజిస్తారు కదూ !

సత్య : అవును చినబాబు !

అమర్ : (వ్రేలితో చూపించి) ఈ మహారాజెవరు !

సత్య : ఇతడు కుంతీదేవికి సూర్యుని అనుగ్రహంవల్ల పుట్టిన పుత్రుడు.

అమర్ : కర్ణుడు కదూ !

సత్య : అవును. ఇతడు దుర్యోధన చక్రవర్తికి కుడిభుజంలా వుంటూ పాండవులు తనతమ్ముళ్లని తెలుసుకునికూడా మైత్రిలోని విలువను మరణాంతంవరకు మరచిపోక నిలుపుకున్న మహావీరుడు.

అమర్: వీరుడుగనుకే యితడు వీరకర్ణుడు అనిపించుకున్నాడు.

సత్య : కాదుమరి?

అమర్: (వేలితో చూపి) ఐతే ఈ వీరుడెవరు?

సత్య : ఇతడు మహారాష్ట్ర వీరసింహకిశోరం ఛత్రపతి శివాజీ. తల్లి జిజియాబాయి బోధనఫలితంగా భారతమాతృ దాస్యబంధన విముక్తికయి అసమాన ధైర్య, శౌర్య, సాహసాలతో మహమ్మదీయరాజుల్ని మారణహోమం చేసి హిందూసంస్కృతిని సంరక్షించిన వీరాధివీరుడు.

అమర్: మంచిపనుల్ని చేసినవారి కీర్తిని ప్రపంచం మరచిపోదు కదూ:

సత్య : శరీరాలు పోయినా కీర్తికిమాత్రం కిలంపట్టదు? చిన బాబు! (శ్రీహరిరావుగారు వచ్చుచున్న చప్పుడువిని భయంతో) తక్కినవారిగురించి తరువాత చెబుతాగాని మీ మామయ్యగారు వస్తున్నట్టున్నారు. ఇక్కణ్ణుంచి త్వరగా నీగదిలోకి వెళ్లిపో!

అమర్: (నిర్భయంగా) ఎందుకొత్తాయి! నువ్వలా భయపడకాఫ్!

సత్య : భయపడక మీ మామయ్యగారితో కయ్యం పెట్టుకో మంటావా?

అమర్: కయ్యానికి మనమేం చేయరానిపని చేస్తున్నామని?

సత్య : ఇష్టంలేనివారి యెదుట మనం ఏంచేసినా కష్టంగా వుంటుంది.

అమర్: కష్టంగా వుంటుందని మన కిష్టమయిన పనిచేయడం మానివేస్తామా?

సత్య : మానకపోతే! మనమర్యాద దక్కదు. (బ్రతిమాలుచూ) నా మాటవిని వెళ్లుబాబూ!

శ్రీహరిరావు: (ప్రవేశించి అసూయగా) నీమాట వినక మీ చినబాబు నామాట వింటాడా?

సత్య : వినక! మీరు కాదన్నపని చినబాబు చేసిందేముందండి!

శ్రీహ : (కోపంతో) చేసిందిలేదేం? నీవు చెప్పిపెట్టే చరిత్రల్ని, చెవిని పట్టించుకుని యిప్పటినుంచే నాకు ఎదురుచెప్పడం మరి యేమిటంటావ్!

అమర్:అడిగినప్రశ్నకి సమాధానం చెప్పడం అపరాధమంటారా

శ్రీహ : (వెటకారంగా) అపరాధంకాదు విపరీతం.

సత్య : (ఆశ్చర్యంతో) అదేమిటండి!

శ్రీహ : ఏమిటా? పట్టుమని పదియేండ్లు లేనివానికి దేశభక్తి ప్రబోధాలూ బయట భాస్కరరావు చరిత్ర ప్రబోధాలూ యింట నీవు. చివరకు వీని కొండనాలుక్కి మందువేసి వున్ననాలుక నూడబెరికే లాగున్నారు.

సత్య : పూర్వజన్మ సంస్కారికి వయస్సుతో పనేముంది?
శ్రీహ : వయస్సుతో పనిలేదని పనికిమాలిన ప్రబోధాలుచేస్తూ "మొండిచేతులవానికి శెనగలు తినడం నేర్పుతావా?
సత్య : (సందేహంతో) అంటే?
శ్రీహ : (వెటకారంగా) అంటే ఎద్దుముడ్డి పొడుచుకొని వ్యవసాయం చేసుకునే రైతుబిడ్డకి విద్యావిషయా లెందుకూ అని.
సత్య : విద్యావివేక సంపన్నుడయి, రైతుమాత్రం రాజ్యాన్ని ఏలగల రాజుకాకూడదంటారా!
శ్రీహ : కాకేం? రైతే రాజ్యాన్ని యేలేవాడయితే?...
సత్య : రాళ్ళసీమలు రత్నాల సీమలవుతాయి.
అమర్ : పంటచేలు బంగారం పండేస్తాయి.
శ్రీహ : (అసూయగా) ఇంకేం? ఇద్దరు యేకమయి నన్ను హేళనకూడా చేస్తున్నారన్నమాట.
సత్య : అదేమిటండి? అలా అపార్థం చేసుకుంటారు? అనవసరంగా?
అమర్ : (నిద్రవచ్చిన ట్లభినయించి ఆవలించును)
సత్య : (చూచి) నిద్రవస్తూవుంటే నీవువెళ్ళి పడుకో చినబాబు!
అమర్ : (వెళ్ళును)
సత్య : (కొంచెం దూరం సాగనంపి తిరిగి వచ్చి) ఇంతకు మీరు గణపతి గారి యింటికివెళ్ళి ముహూర్తం పెట్టించుకొని వస్తానని వెంటనే తిరిగి వచ్చేరేం! కారణం?

శ్రీహ : "వినాయకుని వివాహానికి వేయి విఘ్నాలన్నట్టు" యీ నామూడవ మనువుకి ఇన్ని విఘ్నాలేర్పడుతూ వుంటే తిరిగిరాక యేంచేయమంటావ్!

సత్య : మూఢమని, ముహూర్తాలు లేవని, మూణ్ణెళ్లు గడిపి వేశారు...

శ్రీహ : కాలం కలిసి రానప్పుడు యెన్ని నెలలయినా గడుస్తాయి. యేంచేయమంటావ్!

సత్య : ఈ పర్యాయం ఏం అడ్డొచ్చింది ?

శ్రీహ : ఏడేండ్లు, దాటేవరకు, నేను వివాహం చేసుకొనడానికి వీలేలేదట.

సత్య : (కంగారుపడి) వీల్లేదా ? ఎవరా చెప్పింది ?

శ్రీహ : జ్యోతిశ్శాస్త్రాన్ని, తలక్రిందులుగా, చదివిన సిద్ధాంతి గారే చెప్పేరు !

సత్య : (సాక్షేపణగా) తలక్రిందులుగా శాస్త్రాన్ని చదివిన సిద్ధాంతిగారు తారుమారుగా చెప్పక తిన్నగా చెప్పే తెలివి ఎలా వుంటుంది ?

శ్రీహ : తెలివిలేని వాడయితే నాభూతభవిష్యద్వర్తమానాల్ని, బృహస్పతిలా, పూసగ్రుచ్చినట్లు ఎలా చెప్పగలిగేడు?

సత్య : మీజాతక పత్రికలో లేని విషయాన్ని మీముఖం చూచి చెప్పేడా ?

శ్రీహ : ముఖం చూచికాదు. చేయిచూచి చెప్పేడు.

సత్య : జాతకంలో వ్రాయనిమాట చేతిలో వ్రాసివుందని చెప్పే డంటారా ?

శ్రీహ : చేతి రేఖల్లోగాని ఘడియ ఘడియకి మార్పుజెందే గ్రహాగమనం జాతకపత్రికలో కనిపించదట.

సత్య : మీకు ఎవరేం చెప్పినా "విస్సన్న చెప్పిందే వేద" మని విశ్వసిస్తారా ?

శ్రీహ : విశ్వసించక కండ్లుమూసుకుని గరళం త్రాగమంటావా?

సత్య : గరళం త్రాగమనికాదు నే చెప్పడం వెనుకముందులు విచారించి శ్రేయోదాయకమయిన కార్యం చేయమని.

శ్రీహ : రాబోయే, అపాయానికి ఉపాయం ఏదని నేనూ, గణపతి గంటసేపు తర్జనభర్జల్ను చేసేం.

సత్య : చేసి, నాకు అన్యాయం చేయడానికి నిర్ణయించుకున్నారు.

శ్రీహ : అన్యాయం చేయాలనే వాణ్ణయితే అనునయవాక్యాలతో నిన్ను అవునవిపించవలసిన అగత్యం నాకేం వచ్చింది ?

సత్య : పరబుద్ధి ప్రకారం ప్రవర్తించవలసిన ప్రమాదం వచ్చిందంటారా ?

శ్రీహ : ప్రమాదానికి కాకపోతే ! యీ యేల్నాటి శని నాకు ప్రమోదానికి వచ్చిందా? ఇంతకు సంసారినయి సౌఖ్యం

అనుభవించే సౌభాగ్యముంటే యీ మూడవ మను
వుకి ఇన్ని యిబ్బందులు ఎందుకు ఏర్పడతాయ్.

సత్యా : సంశయించేవారికి అన్నీ సందేహాలే !

శ్రీహ : సంశయించక సాహసించి చావమంటావు.

సత్యా : ఇంతకు మీరనేదేమిటి?

శ్రీహ : ప్రాణాల్ని ఫణంగావొడ్డి పరిణయంఆడి ప్రయోజనం
లేదంటాను.

సత్యా : మీామనువునునమ్మకుని, మీాయింటపడి వున్నందుకు,
నన్నిప్పుడు ఏ గంగలో దిగమంటారు?

శ్రీహ : గంగలో దిగవలసిన గ్రహచారం ఏంకాలింది నీకు?

సత్యా : గ్రహచారం కాకపోతే! కల్లబొల్లి గాలికబుర్లతో
ఆనాడు నాకండ్లుగప్పి యీ నాడు మీారు హృదయం
లేకుండా మాటాడతారా?

శ్రీహ : హృదయం ఉందిగనుకనే, ఉపేక్షచేయకుండా వున్న
మాట చెప్పేశాను.

సత్యా : ఏమని? చెప్పేరు?

శ్రీహ : పెండ్లిచేసుకుంటే నాకు ప్రమాదం అని

సత్యా : అంత ఆత్మదౌర్బల్యంగలవారు ఆదిలో కాసులపేరు నా
మెడలోవేసి"ఇదే మనకు గాంధర్వవివాహం" అనిచెప్పి
ఆనాటినుంచి కాపురంకూడా చేయించుకుంటూ...

శ్రీహ : కాదని యెవరన్నారు?

సత్య : కాదనకపోతే! యీనాడు ఈ కుంభకోణమేమిటి?

శ్రీహ : కుంభకోణానికి, నేనే నీకుభర్తనని నీవేనాకు భార్యవని పరస్పరమేమీ పత్రాలు వ్రాసుకోలేదుగా?

సత్య : పత్రాలు లేవని మనకు హృదయాలుకూడా లేకపోయే యంటారా?

శ్రీహ : హృదయాలుంటేమాత్రం రహస్యంగా మనమేదో అనుకున్నమాటను సంఘంకూడా సమ్మతించాలిగా?

సత్య : సమ్మతించక సంఘం మగవాళ్ళుచేసే మహాద్రోహాల్ని, మరుగుపుచ్చి ఆడవాళ్ళిన్ని అధఃపతనం చేయమని శాసిస్తుందంటారా?

శ్రీహ : శాసించకపోతే వేలాదిరూపాయలు వ్యయంచేసుకుని విధ్యుక్తంగా వివాహాలు ఎందుకు చేసుకోవలసి వస్తూవుంది?

సత్య : సంఘశాసనాన్ని అంత శిరసావహించాలనేవారు అప్పు డా అఘాయిత్యపు కార్యానికి యెందుకు అవలంభిచేరు?

శ్రీహ : అవలంభించేనుగనుకే నీకు ఇచ్చిన బంగారం అరణంగా వుంచుకుని పుట్టింటికిపోయి నీకు ఇష్టమయిన వాణ్ణి వివాహం చేసుకోమన్నాను.

సత్య : పుట్టింటికిపోయి పునర్వివాహం చేసుకోమని మానవత్వ మున్న మగవారు అనవలసిన మాటేనా?

శ్రీహ : ఉండుకని, కరుస్తుందని తెలిసి కాలసర్పాన్ని కౌగలించుకోమంటావా?

సత్య : లేక ! లోకాపవాదానికి లోనయి కాకిలా కలకాలం బ్రతకడం మంచిదంటారా?

శ్రీహ : లోకులేదో అంటారని నా భవిష్యత్తునుమాత్రం బూడిదపాలు చేసుకోలేను

సత్య : (సిగ్గ త్యంగా) ఛీ! భగవంతుడు పశువులకు ఈయని యుక్తాయుక్త వివేకాన్ని మీకు ఇందుకేనా? ఇచ్చింది?

శ్రీహ : ఇచ్చేడని చిచ్చులోవురికి చావమనేగా? నీవిచ్చేసలహా.

సత్య : చావవలసిన కాలం సమీపిస్తే చావక మృత్యుంజయులయి చిరకాలం జీవిస్తారా !

శ్రీహ : అందుకని ఇప్పుడే మృత్యుదేవత నాహ్వానించి ముద్దు పెట్టుకోమంటావు?

సత్య : అంధవిశ్వాసంతో మీరాడే మాటకేమయినా అర్థం ఉందంటారా?

శ్రీహ : అర్థమో గిర్థమో నాకక్కఱలేదు. బ్రతికిబాగుంటేయీ యేడేళ్లు దాటక అయినా వివాహం చేసుకుంటాను. "జీవన్ భద్రాణి పశ్యతి" అని చెప్పినవాడు చేతకాని జేజెమ్మకాదులే !

సత్య : (ఆవేశంగా) యాభైయేళ్లు దాటిన మీరే అరిషడ్వర్గాన్ని అరికట్టుకోలేక, అన్నంపున్నం ఎరుగని నా ఆశాజ్యోతిని ఆర్పివేసి మరోకన్యను కట్టుకోవాలనే కాంక్ష కలిగివున్నారే! పదిహేనేండ్ల పడుచునైన నా కెన్ని ఆశలుంటాయో ఆలోచించేరా?

శ్రీహ : ఆలోచించక నిన్ను కాంక్షలులేని కఱ్ఱబొమ్మనుకుంటే! వివాహం ఎందుకుచేసుకోమని చెబుతాను!

సత్య : (చిరాకుగా) ఛీ! కామాంధులయి, నా కన్యాత్వాన్ని కలుషితంచేసి, మారుమనువు చేసుకోమని సిగ్గులేనివారిని ఛీ! ఛీ! లేం చేస్తాయనేగా? చెప్పడం?

శ్రీహ : (కోపంతో) ఏమిటి ప్రేలేవ్! ఇంతవరకు నీవేం అన్నా శాంతంగా సమాధానం ఇచ్చాను. అందుకు నీవ్యవహారం శ్రుతిమించిపోయింది.

సత్య : (ధిక్కారముగా) ఆడదంటే! మీభోగవిలాసాలకు అనువైన యంత్రమనేగా? మీయభిప్రాయం?

శ్రీహ : (కోపంతో) ఆమాట నే నన్నానా?

సత్య : ఇదిగో! నేను నీళ్ళుకూడా పోసుకుని నెలదాటింది. సిగ్గువిడిచి యీరహస్యంకూడా మీతో చెప్తూవుంటున్నాను.

శ్రీహ : (కంగారుపడి) ఆ! నిజమేనా? ఇప్పుడేమిటి? గతి?

సత్య : ఈ చిదంబరరహస్యం పదిమందినోళ్ళోపడకముందే, పరిణయం ఆడి పరువునిలబెట్టుకోవడంకంటే గత్యంతరం ఏమీలేదు.

శ్రీహ : అంటే! నీకంటిలో, నే వ్రేలుపెడతాను, నానోట్లో నీవ్రేలు పెట్టమంటావ్! అంతేగా నీ సిద్ధాంతం?

సత్య : (దీనంగా) అయితే! మాయని మచ్చతో మన వుభయ వంశాల్ని మట్టిపాలుచేస్తారా?

శ్రీహ : (ఆలోచించి) కనుక మనవుభయులకికూడా అపాయం లేని వుపాయం ఏదయినావుంటే.........

సత్య : వూహించి మీరేచెప్పండి!

శ్రీహ : (ఆలోచించి) సరే! చెప్పినమాటవిని చేయమన్నపని చేస్తావా?

సత్య : చేయవలసిన పనిఅయితే తప్పక చేస్తాను.

శ్రీహ : ఆకార్యంకాస్త కండ్లుమూసుకునిచేసి నీవు మామూలుగా మాయింట్లోనే వుండిపోతే యీ యేడేండ్లు దాటగానే నిన్ను వివాహం ఆడడానికి నాకేమీ యిబ్బంది వుండదు.

సత్య : విషయమేమిటో చెప్పకుండా యేమిటి మీవుపన్యాసం?

శ్రీహ : ఉపన్యాసమేముంది? గ...ర్భ...విచ్ఛి...త్తి

సత్య : (ఉలికిపడి) హరి! హరి! గర్భవిచ్ఛిత్తా! ఎంత అమానుష కార్యం? ఎంతహృదయ విదారకమయిన విషయం?

శ్రీహ : (నిర్లక్ష్యంగా) ఏం? పెద్దపెద్ద కొంపల్లో సర్వసాధారణంగా ఈ అధునాతనయుగంలో సాగుతూవున్న సామాన్య కార్యమేకదా! అది?

సత్య : (తెగింపుతో) కావచ్చు. అందుకని నన్నుకూడా పతితలా పాపకార్యం చేయమంటారా?

శ్రీహ : చేయక గత్యంతరమేముంది? చెప్పు?

సత్య : లేదని తనసంతానాన్నే పొట్టబెట్టుకును ఆడత్రాచుపాములా ఏ మాతృహృదయం భ్రూణహత్యా మహాదోషానికి పూనుకుంటుంది? కారుణ్యమూర్తి అయిన కన్నతల్లి కడుపుతీపి కఠినపాషాణంలా కరుడుగట్టిన మీ హృదయానికి ఎందుకు ఉంటుందిలెండి?

శ్రీహ : లేకకాదే. సత్యవతి! సాధ్యంగాక

సత్య : సాధ్యంగాకపోతే.

శ్రీహ : సత్వరం తెగదెంపులుచేసుకుని నీవు నాయిల్లు విడిచి వెళ్ళిపోవాలి!

సత్య : (కోపంతో) కలిగినవారిగుట్టు గడపదాటదనే కండకావరంతో మీరు లోకులకండ్లు మూయగలరేమోగాని లోకేశ్వరునికండ్లుమాత్రం మూయలేరు.

శ్రీహ : అందుకని?

సత్య : భగవంతునికయినా, భయపడి ప్రవర్తించకపోతే యిహ వరాలు ఉండవ్!

శ్రీహ : లేకపోతే లేకపోతాయి. వైరాగ్యవాక్యాలు కట్టిపెట్టి ముందు ఇక్కణ్ణుంచి నీవు వెళ్ళిపోవాలి.

సత్య : (దీనంగా) నమ్మినవారి జీవితాన్ని నాశనంచేయడం న్యాయంకాదండి.

శ్రీహ : (కోపంతో) ఆట్టేప్రేలక ఇక్కణ్ణుంచి వెళ్తావా? వెళ్ళవా?

సత్య : (మొండిగా) ఎందుకని వెళ్ళాలి?

శ్రీహ : (గట్టిగా) ఎందుకని వెళ్ళవ్!

సత్య : ప్రత్యక్షంగానో పరోక్షంగానో మీరునన్ను పెండ్లాడేరు—గనుక యీ యింట్లో వుండడానికి నాకు కూడా శాస్త్రసమ్మతమయిన సంపూర్ణహక్కువుంది.

శ్రీహ : అదాసంగతి? ఇంటిలో తిని యింటివాసాలు లెక్కపెట్టినట్టు అంతవరకు వచ్చిందేం?

సత్య : రాక? లేదని రచ్చకెక్కి ఋజువుచేయగలరా ?

శ్రీహ : ఋజువుచేయవలసిన అగత్యం నాకు ఏమీలేదు. వెళ్ళనంటే వెళ్ళగొట్టడమే నా విధానం.

సత్య : "ఆడదంటే అబలకదా! మన ఆటలు సాగుతాయని" అనుకున్నారేమో! సహనముంటే అబల సబలమై ఏకార్యం చేయడానికయినా వెనుదీయదు. సుమండి.

శ్రీహ : (కోపంతో) వెనుదీయదేం? (చెంపపైకొట్టి) ఇప్పుడైనా వెళతావా?

సత్య : (నిర్భయంగా) మీరేంచేసినా వెళ్ళనని యిప్పుడేగా? చెప్పేను.

శ్రీహ : (కోపంతో) ఎంతబండకెత్తిమాట్లాడుతున్నావ్! ఇదిగో! యిప్పుడే నీపీకినులిమి, పారవేస్తాచూడు.(మీదకు పోయి పీకి నులుమును)

సత్య : (బలవంతంగా తప్పించుకొని గట్టిగా వెనుకకు నెట్టును)

శ్రీహ : (పడిలేచి కోపంతో) దుర్మార్గురాలా! యిప్పుడు నీరక్తం కంటచూస్తాచూడు(మొలలోని బాకుతీసి పొడవబోవును)

సత్య : (ఉద్రేకంగా) ఆగండి! హత్యచేస్తేమాత్రం నన్ను అధమా యించే అధికారులు ఎవరనేగా? మీ అహంభావం?

శ్రీహ : (కోపంతో) అవును ఆమాట ముమ్మాటికి నిజం.

సత్య : (ఆలోచించి) అయితే! ఆ పాపపుపనికి మీరంతపాల్పడవలసిన పనిలేదు లెండి.........

శ్రీహ : అయితే వెళతావా?

సత్య : నా ప్రాణంమీదితీపితోకాదు. మరోఆదర్శంకోసం ఆత్మప్రబోధంప్రకారం నేనీక్షణం మీయిల్లు విడిచివెళ్ళి

పోతాను. ఇదిగో! నాగపాశాల్లాంటి మీ నగలు నన్ను రక్షించవు. (తీసిమీాదకు గిరటవైచి) సావిత్రి, దమయంతి, సీత. రుక్మిణి మొదలయిన పతివ్రతామణుల్ని గన్న భరతమాత పవిత్రగర్భాన్ని పుట్టిన సత్యవతి కనకానికి తనశీలాన్ని అమ్ముకున్న గణికమాత్రంకాదని మీాపాపదేవత మీా యెదుట భయంకర నృత్యంచేస్తూ మిమ్మువరాభవించిన నాడయినా పశ్చాత్తాపపర్వతం మీా హృదయగహ్వరంలో పెకేలునప్పేలి తుపాను చెలరేగకపోదు శెలవ్.

(వేగంగా వెళ్ళిపోవును)

శ్రీహ : (నిశ్చేష్టుడై కొంచెంసేపు నిలబడి నిట్టూర్పు విడిచి నగలు యేరుకుని యిటునటు తిరుగుతూ తనలో) కర్మంచాలక, ఈ గయ్యాళిగంప, యీా రాత్రి, యే మూతిలోనో గోతిలోనో దిగి, నామెడమీాదకి కత్తితీసుకుని రాదుగదా ?

(తెరలో ఆకాశవాణి)

ఉ॥ స్నేహముఁ జేసి దుష్టమతి చెప్పినమాటను లెకమేని, సం
దేహముఁ జెంది కాదనక దివ్యమనస్విని౯ దూలనాడి, దు
స్సాహసకార్యమున్ సలిపి చావక చచ్చిన వాఁడవైతివో
ద్రోహి! త్వదీయ జన్మమిక దోషపరీతము గాక పోవునే !

శ్రీహ : (విని భయకంపితుడై వెడలిపోవును.)

(తెరపడును)

శ్రీః

# కన్యాకూతురు

## [ ద్వితీయ దృశ్యం ]

[శ్రీహరిరావు గారి మేడ కచేరీ చావడిలో శ్రీహరిరావుగారు కుర్చీలో కూర్చొని పుస్తకం చదువుతూవుంటారు]

శ్రీహ : సీ॥ ఎంతటి యుద్యోగి, నేన్వాళవర్తిగా
నొనరింప లోహబంధనము, ధనము
గ్రామకలహ, పరిష్కారంబుఁ, గావింపఁ
దగవరిఁ, జేయ, సాధనము, ధనము
పగతురఁ, గష్టాల, పాలు జేయింపంగ
ఘనకోపవహ్నికిం, ధనము ధనము
స్వాభిలాషోష్ణతఁ, జల్లార్చి సంతృప్తిఁ
బొనరింప శీతచందనము ధనము
తే॥ అనవరత సర్వకార్య పూరణము ధనము
ప్రబల శత్రుభయైక వారణము ధనము
అనుపమానంద సౌఖ్యవర్ధనము ధనము
వినుతగౌరవ స్థితికిఁ గారణము ధనము.

ఆహా! ఈ పద్యం చెప్పినకవి ఎంత అనుభవశాలి.

గణ : (ప్రవేశిస్తూ) కాదండిమరి ?

శ్రీహ : (చూచి) గణపతివా ? యీవేళ యింత ఆలస్యం అయిందేం ?

గణ : ఇంకానయం, యెంత తొందరపడితే ! ఇప్పటికి రాగలిగే నంటారు ?

శ్రీహ : ఏం ? యీ వేళేం వచ్చింది ?

గణ : (కూర్చుంటూ) ఏం చెప్పమంటారు ? యీ వేళ మా వాళ్ళకు ఆదివారంగదాండి.

శ్రీహ : మీవాళ్ళకు ఆదివారమయితే ? నాలుగు మెతుకులు తినివచ్చే దానికి సీవ నేముంటుంది ? యింట్లో ?

గణ : లేకపోవడమేమిటి ? ఆదివారంనాడు మా గృహలక్ష్మికి కావలసినవన్నీ అందిస్తే తప్ప యేవస్తువు లోటుచేసినా ప్రసవించిన పెద్దపులిలా నాప్రాణాలు కొరుక్కు తినే యదూ ?

శ్రీహ : (నవ్వి) ప్రతి ఆదివారం నీకీ ప్రమాదం తప్పదన్న మాటేగా ?

గణ : తప్పదు బాబు ! తప్పదు ! బ్రహ్మదేవుడు, నామెడకు ఈ బ్రహ్మరాక్షసిలాంటి భార్యను కట్టబెట్టేడు.

శ్రీహ : ఆదిలో ఆడవాళ్ళి నెత్తికెక్కించుకుని యిప్పుడు దిగం డంటే ! యెలాదిగుతారు చెప్పు ?

గణ : ఆడవాళ్ళతో బాధలు మీకు లేవు గనుక అలా చెబు తారు గాని మోసేవారికి తెలుస్తుంది మోతబరువు.

శ్రీహ : ఏమిటి ? శింగినాదం తెలిసేది ?

గణ : ఏమిటంటారా? నాయిల్లాలితో నే పడేబాధలు యేకరవు పెట్టి చెప్పాలంటే యేడాది చాలదు

శ్రీహ : (ఆశ్చర్యంగా) అట్లాగటయ్యా?

గణ : ఇంటుగుట్టు యెవరికి చెప్పకూడదని మీకుకూడా నేనెప్పుడు చెప్పలేదు గాని యేనాటికి ఆనాడు యెన్నెన్ని ఆహారపదార్ధాలు యింటికి తెచ్చి పారవేస్తున్నా, యివిలేవు అవిలేవు అంటూ నాయెముకలు నమలిపారేస్తుంది యేం చెప్పకోమంటారు? బాబు! నాభార్యతో పడేబాధలు?

శ్రీహ : (జాలిగా) పాపం!

గణ : అందులోను యీ ఆదివారం నాడు అయిదు రూపాయలు ఖర్చుపెట్టినా, యేదోలోటు కనపర్చి వెక్కిరించక మానదు గదండి.

శ్రీహ : ఇంతకు నిన్ను ఆటబొమ్మలా ఆడిస్తుందంటావు అంతేగా?

గణ : ఆటబొమ్మలా కాదు ఆమెమాట కాదన్నానంటే పాతచెప్పులా పనికిమాలినవానిగా పరిగణించి నాపరువును బజారు పాలుచేసేస్తుంది.

శ్రీహ : అలాంటి ఆవిణ్ణి పెళ్ళెందుకు చేసుకున్నావ్?

గణ : మేనరికమని నా మెళ్ళుపెరిచి పెళ్ళి వెధవలు.

శ్రీహ : పూజలు పునస్కారాలు చేసే ఆవిడికి భర్తను భగవం తుణ్ణిగా పూజించాలని తెలియకపోవడం ఏం తెలివి తక్కువంటావ్ !

గణ : ఆ పూజలేబాబు ! నాపుట్టి ముంచేసేయ్ !

శ్రీహ : (ఆశ్చర్యంగా) పూజలేం చేసేయి !

గణ : పాశ్చాత్య నాగరికతా ప్రభావం ఇంత విచ్చల విడిగా తలవిరబోసుకుని స్వైర విహారంచేసే, యీ వైజ్ఞానిక యుగంలో కూడా, స్నానాలని, సంధ్యలని, పూజలని, పుణ్యాలని వెఱ్ఱి బుఱ్ఱి నమ్మకాల్తో మగవాళ్లి విసుగిస్తూ వేధించుకు తినడానికిగాని! యెందుకు వచ్చిన వండీ ! ఈపిచ్చి పన్లూ !

శ్రీహ : అవునవును. యింతముందుకు పోయిన యీ యిరువ దవ శతాబ్దంలో కూడా మన హిందూ స్త్రీలకి ఈ బూజు పట్టిన పూర్వాచారాలు పోకపోవడం యేం గ్రహచారమంటావ్ ! చెప్పు ?

గణ : గ్రహచారం కాకపోతే ! విదేశీయుల్లా మనవాళ్లుకూడా యీపాటికి యెంతో ముందుకుపోయి వుందురు గదండి!

శ్రీహ : ముందుకు పోవడమేకాదు. అన్ని దేశాల వాళ్ళకి ఆదర్శప్రాయంగా కూడా వుంటారు.

గణ : అఘోరించేరులెండి!

శ్రీహ : ఆవిషయం కట్టిపెట్టి ముందు అమర్‌నాథ్ విషయం యేం ఆలోచించేవో చెప్పు.

గణ : నన్నేం చెప్పమంటారు?

శ్రీహ : సత్యవతి పీడవదిలిపోయినా, పీడిపీడ వదిలేటట్టు కని పించడంలేదు.

గణ : అందుకే! ఎప్పుడో వచ్చే అపాయానికి ఇప్పుడే ఉపాయం ఆలోచించుకోమన్నారు!

శ్రీహ : వీడు మనయెదుట ఉన్నాడంటే! ఇప్పణ్ణుంచి ఈర్ష్య పెట్టుకుని పెద్దవాడయ్యేక ప్రళయం తీసుకుని రాక మానడు.

గణ : అందుకు నాకు ఒకఉపాయం తోచింది. చెప్పమంటారా!

శ్రీహ : ఏమిటది? చెప్పు?

గణ : ఏముందండి. చదువుకని వంకపెట్టి మద్రాసుపంపివేయ డమే!

శ్రీహ : అదిమంచి వుపాయమేగాని చదువుకుని యేకులాగ వెళ్ళినవాడు మేకయిరాడుగదా?

గణ : అంటే! చదువుకుని లోకజ్ఞానం సంపాదిస్తాడనా? మీా సందేహం?

శ్రీహ : అవును!

గణ : పట్నాం వెళ్ళిన కుఱ్ఱోడు విలాసాలకి లోనయి పాడయి పోతాడుగాని చదువుకుని బాగుపడేవాడు కోటికి ఒక్క

డుండడు! అందులోను చేతినిండా డబ్బువున్నవాని మాటచెప్పనక్కఱలేదు. ఈరోజుల్లో.

శ్రీహ : ఈ ఉపాయం మంచిదే!

గణ : మంచిదేమిటి? నిక్షేపంలాంటిది.

శ్రీహ : వీడిగురించి మనకు నెలకి అరవయిరూపాయలు ఖర్చు అయినా? బాధలేదు.

గణ : అవునండి.

శ్రీహ : ఇవ్వాణ్ణుంచే నా చెప్పుచేతల్లో సరిగాలేనివాడు పెద్దవాడయ్యేక వుంటాడా?

గణ : గోటితోగిల్లితే పోయేదానికి గొడ్డలికావలసి వస్తుంది.

శ్రీహ : చతురోపాయాలు ఉపయోగించి ఈ వేళోరేపో వీణ్ణి మద్రాసువంపే కార్యం నీవల్లేగాని నావల్లకాదు.

గణ : ఆ భయం మీకేమీ అక్కఱలేదు. ఆ పని నా పయిని వదిలివేయండి. తిమ్మిని బొమ్మినిపెట్టి నే వంపివేస్తాగా?

శ్రీహ : వదేండ్లు మద్రాసులోనే వీణ్ణి ఉంచివేశామా? మన రహస్యపు కార్యాలు నిరాటంకంగా నెరవేరిపోతాయి.

గణ : నెరవేరడమేకాదండి. పదిరాళ్లు సంపాదించుకుంటాం కూడాను.

శ్రీహ : సరే! నా భోజనం వేళ అయింది. వెళ్ళిరానా?

గణ : చిత్తం. నా పనిమీద నేనూ పోతాను. (వెళ్లును)

శ్రీహ : (గదిలోకి వెళ్ళును)

[తెరపడును.]

శ్రీః

# కన్నకూతురు

## [తృతీయ దృశ్యం]

(సర్వోదయ సమాజాశ్రమం - ముఖద్వారమున "సర్వోదయ సమాజాశ్రమం" అని బోర్డు - హాలులో బుద్ధుడు, అశోకుడు, రాజారామ మోహనరాయలు, రవీంద్రుడు, వివేకానందస్వామి, గాంధీ, కందుకూరి, గురజాడ మొదలగు వారి ఫోటోలు ఉండును.)

ఆశ్రమాధిపతి దయానందస్వామి యథోచితాసనముపై కూర్చొని పాడుతూ ఉండును.

"భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ మూఢమతే!
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి, నహి రక్షతి డుకృఙ్ కరణే ॥భజ॥
మూఢజహీహి ధనాగమ తృష్ణాం
కురుసద్బుద్ధిం మనసి వి తృష్ణాం
యల్లభసే నిజకర్మోపాత్తం
విత్తంతేన వినోదయ చిత్తమ్ ॥భజ॥
నారీ స్తన భర నా భీదేశం
దృష్ట్వా మాగా మోహావేశం
ఏతన్మాంస వసాది వికారం

మనసి విచింతయ వారంవారం ॥భజ॥
నళినీదళ గత జలమతి తరళం
తద్వజ్జీవిత మతిశయ చపలం
విద్ధివ్యాధ్యభి మానగ్రస్తం
లోకం శోకహతంచ సమస్తమ్ ॥భజ॥
అర్థమనర్థం భావయ నిత్యం
నాస్తి తతస్సుఖలేశ స్సత్యం
పుత్రాదపి ధనభాజాం భీతి
స్సర్వత్రైషా విహితా రీతిః ॥భజ॥
సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥భజ॥
పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరే శయనం
ఇహ సంసారే బహు దుస్తారే
కృపయాఽపారే పాహి మురారే ॥భజ॥
యోగరతోవా భోగరతోవా
సంగరతోవా సంగవిహీనః
యస్యబ్రహ్మణి రమతే చిత్తం
నందతి నందతి నందత్యేవ ॥భజ॥

గేయం గీతానామ సహస్రం
ధ్యేయం శ్రీపతి రూపమజస్రం
నేయం సజ్జన సంగతమనిశం
దేయం దీనజనాయచ విత్తం" ॥భజ॥

(పాట ముగించి సభ్యుల నుద్దేశించి)

నాయనలారా ! సహజీవన సౌలభ్యార్థం మను కాలం నుంచి మనకు ఆయావృత్తుల్ననుసరించి కులమత భేదాలు ఏర్పడ్డాయి తరువాత మన ఉచ్ఛనీచ ప్రవృత్తుల్ని బట్టి స్పృశ్యాస్పృశ్య భావాలేర్పడి, అవే కాలం మారినా, తాము, మార్పు జెందక, రాను రాను, వెఱ్ఱితలలేసి, మానవత్వాన్ని మరిపించి వేశాయి. నిజం ఆలోచిస్తే ? "జన్మనాజాయతే శూద్రః కర్మణా జాయతేద్విజః" అను వేదసూక్తి ననుసరించి మానవుల్లో

సీ॥ కనిప్రేమఁ బెంచిన, జననీజనకులను
భక్తిసేవింపని, వాఁడు మాల
అగ్నిసాక్షిగఁ గొన్న, యర్ధాంగి విడి పర
భామలఁ గూడెడు, వాఁడు మాల
మాతృదేశప్రేమ, మరచి, తద్ద్రోహంబుఁ
బచరించు చుండెడు, వాఁడు మాల
పరజనౌన్నత్యంబుఁ, బరికించి యీర్ష్యతో
వర్తించుచుండెడు, వాఁడు మాల.

తే॥ బ్రహ్మవైశ్య, క్షత్రియ, శూద్ర, భావములిల
వర్తనంబును బట్టియే వచ్చుఁగాని
పుట్టువున నెవ్వరికిఁగూడ పొసఁగ వెపుడు
పూతగుణులార భారత పుత్రులార !

డాక్టర్ : (ప్రవేశించి) నమస్కారం స్వామీ!

దయా : (చూచి) డాక్టర్! అయితే 18 వ నెంబరు గదిలోని ఆ అభాగిని ఆరోగ్యం, యీవేళ యెలావుంది?

డాక్ట : ఇంక ఆమె ఆరోగ్యం గురించి మనం ఆందోళన పడ వలసిన అవసరంలేదు. స్వామి!

దయా : ఐతే! పాపాయి చాలా అదృష్టవంతురాలన్నమాట!

డాక్ట : అందువల్లే, తల్లికికూడా గండం తప్పిపోయింది స్వామి!

దయా : అవును. ప్రసవించిననాటి పరిస్థితి చూచి నాకు చాలా భయం వేసింది సుమా !

డాక్ట : మీకేకాదు నాక్కూడా ఆభయం లేకపోలేదు. మీతో చెప్పలేదుగాని——

దయా : అందుకే! ఆయువున్నవారిని అడవిలో విడిచిపెట్టినా హాని రాదన్నారు.

డాక్ట : ఆమాట నిజం స్వామి!

దయా : జగన్నాటకసూత్రధారుడయిన జగదీశ్వరుని పరిపూర్ణానుగ్రహం ఉన్నవారిని చీమకూడా కుట్టదు.

సీ॥ ఱాతిలో జన్మించి ఱాతిలోఁ బెరిగెడు
భేకావళికిఁ దిండిఁబెట్టువాఁడు
మాతృగర్భమునందు, మసలెడు శిశువున
కాహార మొనఁగూర్చి, నట్టివాఁడు
కాననఁ దిరుగాడు, ఖగమృగావళులకు
నన్నప్రదాతయై, యలరువాఁడు
జలమున వసియించు జలచరకోటికి
జీవనాధారుఁడై వెలఁగువాఁడు
తే॥ జంగమస్థావరాత్మక, జగమునందనదు
కుక్షి కుహరంబు, నందుంచు, కొనినవాఁడు
ప్రోవకుండునె? దీనులఁ బూర్ణకరుణ
మూతిబెట్టిన దేవుఁడే మేతఁబెట్టు.

డాక్ట : అవునుస్వామి! "నారుబోసినవాఁడు నీరుపోయక మానడు" మీరు సెలవిచ్చినట్లు.

దయా : డాక్టర్! పాపాయికూడా పాలుతాగుతూ ఆనందంగా ఆడుకుంటూ వుందిగా?

డాక్ట : తమ ఆశీర్వాదంవల్ల హాయిగా ఆడుకుంటూ, అప్పుడే ముద్దులు మాటగట్టుతూవుంది కూడాను,

దయా : పాపాయిముఖవర్చస్సును బట్టిచూస్తే గొప్పభాగ్యవంతురాలయి భారతనారీ లోకానికి ఆదర్శురాలు అయితీరుతుందనక తప్పదు.

డాక్ట : అవును స్వామి! మల్లెపూవు పుట్టువుతోనే మంచివాసన కలిగి వుంటుంది.

దయా : ఇంతవరకు మనకు ఆ అభాగిని తన వృత్తాంతం ఇద మిత్థమని యేమీ చెప్పలేదుగా?

డాక్ట : మనకేకాదు తనను మన ఆశ్రమానికి తీసుకుని వచ్చిన ఆ రైతులికికూడా చెప్పలేదటండి.

దయా : (ఆశ్చర్యంగా)ఆరైతులు ఆనాడు ఆమె విషయమయి నీతో యేంచెప్పారు?

డాక్ట : "ఈమె మా గ్రామంవచ్చి మాపదిమందికి తలలో నాల్కగా ప్రవర్తిస్తూ ప్రపంచ పరిస్థితుల పరివర్తనం గురించి ప్రబోధ గీతాలు పాడుతూ కాలక్షేపం చేయ డం తప్ప తన జీవిత విశేషాలేవీ చెప్పలేదు" అని స్వామి! వాళ్లు చెప్పిన విషయాలు.

దయా : ఎవరికి తన వృత్తాంతం చెప్పక పోవడం విచిత్రంగా వుందే!

డాక్ట : నిజమే స్వామి! నిన్న ఉదయం లాలిపాట పాడుతూ పాపాయిని లాలిస్తూ వుండగా నేను అటు వెళ్లి "మా ఆశ్రమనియమం ప్రకారం మీపేరు మీవూరు చెప్పాలి" అనేసరికి నిమిషం నిశ్చేష్టురాలయి నిలబడి "క్షమించండి డాక్టరుగారు" అని కన్నీరు కారుస్తూ గభాలున తనగదిలోనికి వెళ్ళిపోయింది.

దయా : (తలపంకించి)ఆమె జీవితచరిత్రలో వెల్లడి చేయరాని విషాదఘట్టమేదో ఉండాలి. లేకపోతే! కనీసం తన పేరు

చెప్పడానికి కూడా సంశయించవలసిన కారణమే ముంటుంది?

డాక్ట : కారణమో! ఆమె గ్రహచారమో, గాని స్వామి! నడ వడినిబట్టి ఆలోచి స్తే ఆదర్శగృహిణీ లక్షణాలుతప్ప ఆమెలో అవగుణాలు మాత్రం............

దయా : లేవు. ఆవిషయం నేనాదిలోనే కనిపెట్టాను.

డాక్ట : సావకాశంగా నేడో రేపో మీరే ఆమె వృత్తాంతాన్ని అడిగి తెలుసుకోండి. స్వామి!

దయా : సరే! నీవు నాతో గ్రామాంతరం వెళ్లాలని చెప్పేవు వెళ్ళలేదా ?

డాక్ట : పదిగంటలకు బయలు దేరి వెళ్ళి పనిచూచుకుని యిప్పుడే వచ్చానండి.

దయా : అయితే ఆశ్రమరోగులంతా నిన్నెదురు చూస్తూ ఉంటారు. అందర్ని ఒకసారిచూచిరా!

డాక్ట : నమస్కారం! స్వామి (వెళ్ళును)

దయా : (సభ్యుల నుద్దేశించి) నాయనలారా! సంఘసంస్కార సమస్యల్లో పునర్వివాహసమస్య చాలప్రధానమయింది. ప్రచండసంఘశాసనంతో సాగిపోతూవున్న సహగమన దురాచార ప్రవాహానికి మొదట రాజారామమోహన్ రాయలు గట్టువేసి గణుతికెక్కాడు. తరువాత కంద

కూరి వీరేశలింగంపంతులుగారు "యౌవనదశలో పురుషులికి భార్యావియోగం స్త్రీలకి భర్తృవియోగం ప్రాప్తమయి వివాహేచ్ఛ తమకున్నచో విధిగా వివాహంచేసుకొని తీరాలి" అని వివరించారు. అనేక అనాధ శరణాలయాల్ని కూడా స్థాపించారు. చాలమంది అనాథల్ని సనాథల్ని చేసి సఫలీకృత జీవులయ్యారు. కాని కొందరు తలిదండ్రులు తమ పూర్వాచారాల్నే సదాచారాలంటూ మూఢ్యవాదాలు సాగిస్తూ, స్వార్థాంధులయి, పాతచీపురుకట్టకి పట్టుకుచ్చు కట్టినట్టు ముక్కుపచ్చలారని తమముద్దుబిడ్డల్ని "పూరుపోమ్మంటూ కాడరమ్మం"టున్న యే మూడుకాళ్ళ ముసలయ్యకో; "కూటికి చేతులు కాటికికాళ్ళు" చాచుకుని కూర్చొనివున్న యేదీర్ఘవ్యాధిగ్రస్తునికో; ముడిపెడుతున్నారు. "అమ్మ గృహప్రవేశం చేసేసరికిఅయ్య శ్మశానప్రవేశం" చేయడంతో అమ్మలక్కలందరుచేరి ఆబాలవిధవను వల్లించిన వైరాగ్య వాక్యాల్తో ఓదారుస్తూ పసుపుబట్టలతో ఆమె మాంగల్యాభరణాల్ని ఒలిపించి "ఇంక ఆమెను జీవితాంతం జీవచ్ఛవంలా జీవించ" మంటున్నారు.

యేబాలవితంతువయినా యింద్రియదౌర్బల్యం చే తబలీయమయిన ప్రకృతికి లొంగిపోయి, వరోత్సుంగానో

ప్రత్యక్షంగానో పాపఫలానికి పాల్పడి భ్రష్టురాలుకాగా తరువాత తలిదండ్రులు తలమోదుకుని తమ లోకాపవాదాన్ని తప్పించుకోగలరా? అంచేత యిప్పణ్ణుంచి అష్టాస్త్రీ విషయమైన మన సనాతన సంకల్పానికి స్వస్తి చెప్పేసి కాలానుగుణ్యంగా బాల్యబలవద్వివాహాల్ని మాన్పించండి. స్త్రీనరభ్రూణశిశుహత్యాది ఘోరకృత్యాలికి తావీయక పునర్వివాహాల్ని పూనికతో చేస్తూ చేయిస్తూ పాణిగ్రహణ ప్రయోజనాల్ని ఫలప్రదం చేయండి.

సీ॥ పురుషార్థ సాధనంబునకుఁ బేరెన్నికఁ
గన్నయట్టిది యోచుఁ గ్రాలుఁబెండ్లి
ఆశ్రమవాస సౌఖ్యాపాదనమునకు
నాధారభూతమై యలరుఁ బెండ్లి
అతిథిజనౌఘ హృదానంద సంధాన
నిరతాలవాలమై నెగడుఁ బెండ్లి
కాలక్రమాగత కష్టపాథో రాశిఁ
దరియింపనౌకయై తనరుఁ బెండ్లి
తే॥ అట్టి పెండిలి నానుకూల్యంబు గలుగు
నెడల క్షీరనీరన్యాయ మదరు దంప
తులకుఁ గాకున్నచో మేటి దోసఁగు పొసఁగుఁ
బుణ్యభారత మాతృ సత్పుత్రులార!

డాక్టర్: (తొందరగా ప్రవేశించి) నమస్కారం! స్వామీ!
దయా: (చూచి) ఏం? డాక్టర్! వెంటనే తిరిగి వచ్చావ్!

డాక్ట : పాపం ఆ అభాగిని వెళ్ళిపోయిందటండి !

దయా : (ఆతృతగా) ఆ ! వెళ్ళిపోయిందా ?

డాక్ట : అవునుస్వామి ! ఆమె తన [illegible] పూర్వోత్తరాలుయెవరికి చెప్పడానికి, వివరిం[illegible] అనేదో వుండి యిట్లా రహస్యంగా వెళ్ళిపోయిం దంటూరా?

దయా : కాటుక బొట్టూ పెట్టుకుంటూ కలకల్లాడే ముఖంతో వుండే ఆమెను బాల వితంతువని భావించడానికి కూడా వీల్లేదు.

డాక్ట : అవును స్వామి !

దయా : పదిహేనేండ్లు పడుచు ప్రసవించడానికి ముందు బంధు జన పరోక్షంగా పల్లెల్లో తిరిగి బాధలు పడవలసిన కారణం కూడా ఆమె యే ప్రేమివంచితురాలో అయి వుంటుందని నేవూహిస్తున్నాను.

డాక్ట : అవునండి స్వామి ! మీరన్నట్లు యే వంచితురాలు కాకపోతే ! ఆమెకు అజ్ఞాతవాసం చేయవలసిన అగత్యం ఏం పట్టిందంటారు ?

దయా : ఈ వేళతో పాపం బ్రతుకుమీద నిరాశ చేసుకుని యేటిలో దిగి ప్రాణత్యాగం చేసుకోలేదు గదా ?

డాక్ట : అంత ఆత్మహత్యకు అవలంబించేది కంటిని రెప్పలా కాపాడుకుంటూవున్న కన్నకూతుర్నెందుకు ఇచ్చట పారవేసి పోదంటూరు ?

దయా : అవును. నిజమే! ఆమె చర్య యేవిధంగా ఆలోచించినా ? అయోమయంగానే వుంది సుమా ?

డాక్ట : మీరన్నట్లు ప్రేమించిన వాడెవడో చేయవలసిన ద్రోహంచేసి పెండ్లి చేసుకోకపోగా పాపం! సంఘపు సంకెళ్ళకు వెరచి అజ్ఞాతంగా యింతకాలం వెళ్ళబుచ్చి.......

దయా : వెళ్ళబుచ్చియేం లాభం? "ఈనగాచి నక్కలపాలు చేసిన"ట్లు యీ నాటితో పాపాయితోబాటు ఇహ లోకయాత్ర ముగించివుంటే ?

డాక్ట : అలాంటిపని ఆదిలోనే చేస్తుంది గాని యింతకాలం బ్రతికి చిట్టచివర యీలాంటి చెడ్డపని చేయదనే, నా నమ్మకం స్వామి !

దయా : లోకంలో దురాత్ముల మాయకులోనయి, యిలాంటి అభాగినీ అభాగ్యుల జీవితాలు ఎన్నెన్ని క్రుంగికృశించి కూలిపోతున్నవో గదా ? పాపం.

(ఒక ఆశ్రమవాసి పరుగునవచ్చి దయానందస్వామికొక కవరిచ్చును)

దయా : (కవరుపైన వ్రాసిన వ్రాతచూచి చదువును) "దయవుంచి దయానందస్వాములు వారు తప్ప, యీకవరు విప్పి యెవరు చదువరాదు......

ఇట్లు మీ విధేయురాలు. సత్యవతి"

డాక్ట : (సంతోషంగా) ఆ అభాగిని వ్రాసిందే అనుమానం లేదు స్వామి !

దయా : (ఆశ్రమవాసితో) ఈ కవరు నీ కెక్కడ దొరికిం దబ్బాయి !

ఆశ్ర : ఇది ఆపద్దెనిమిదవ నెంబరు గదిలో దొరికిందని మన గంగు లిచ్చాడు స్వామి !

డాక్ట : అయితే యింకేం ? ఆమెదే స్వామి ఈ కవరు.

దయా : ఆమెపేరు సత్యవతి అన్నమాట?

(తెరలో గంటమ్రోత వినబడును)

అప్పుడే ప్రార్థనా సమయమయి నట్లుంది లేవండి ప్రార్థనానంతరం యీ కవరులో విషయం ఆలోచించు కుందాం.

డాక్ట : చిత్తం! స్వామి!

(అందరు వెళ్ళుదురు)

(తెరపడును.)

శ్రీః

# కన్నకూతురు

## [చతుర్థదృశ్యం]

(ధర్మయ్యగారియిల్లు చావడిలో నొక డ్రాయరు. మూడు కుర్చీలు వుండును. ప్రభావతి కుర్చీలో కూర్చొని వుండును.)

ప్రభా : (డ్రాయరుమీదనున్న నొకపుస్తకం తీసికొని చదువును)

సీ॥ వల్మీక సంభవ, వ్యాసబుద్ధాశోక
గాంధీముఖుల్, నీదుకడుపు పంట
సావిత్ర్యరుంధతీ, జానకీరుక్మిణీ
ప్రభృతి సాధ్వులు, నీదు వరదుహితలు
నదనదీ కాననన, నగసర్వ, సస్యాఢ్య
భూభాగములు నీదుభూషణములు
శాంత్యహింసాదయా, సత్యక్షమాశౌచ
శమదమాదులు, నీదుసద్గుణములు
తాజమహల్ నీదు, తలదాచుకొనుకొంప
కోహినూర్మణి నీదు, కొప్పుపువ్వు
తే॥ భాసుర, చిరత్న, రత్న, సువర్ణ, రజిత
ఘనఖనీకోటి నీదుదాచిన ధనమ్ము
సకలదేశ సంస్తవనీయ సచ్చరిత్ర!
భరతమాత! నీకు సహస్రవందనములు.

ధర్మ : (ప్రవేశిస్తూ) ఏం పుస్తకమమ్మా! నీవు చదివేది?

ప్రభా : (లేచి) ప్రజారాజ్యం నాన్నగారు!

ధర్మ : (కుర్చీలో కూర్చొని) ఇదేనా? అమర్‌నాథ్ వ్రాసిన పుస్తకం?

ప్రభా : (కూర్చొని) అవును నాన్నగారు!

ధర్మ : ప్రజారాజ్య రాజకీయాల్ని అతడు దీన్లో బాగా వ్రాసేడటగా? పాపాయ్!

ప్రభా : అవును నాన్నగారు!

ధర్మ : ఆగర్భశ్రీమంతుడయినా ప్రస్తుతపరిస్థితుల్ని బాగా అవగాహనం చేసుకుని యీ కాలానికి కావలసిన గ్రంథం వ్రాసేడు.

ప్రభా : అధర్మాన్ని ధర్మంతో అసత్యాన్ని సత్యంతో సాధించాలనే గాంధీసిద్ధాంతాల్ని కరతలామలకంగా గ్రహించగలిగినవారుగాని యీలాంటి గ్రంథాలు వ్రాయలేరు నాన్నగారు.

ధర్మ : కాదుమరి? పాలితుడు పాలకుడు అనేభావం పోయిన ప్రజారాజ్యంలో అమర్‌నాథ్‌లాంటి పుణ్యాత్ముడు పుట్టి అహింసాత్మక విప్లవాన్ని లేవదీయకపోతే ప్రజారాజ్యం ఎన్నటికీ ఫలప్రదం కానేరదు.

ప్రభా : అవునునాన్నగారు! ఆనాడుగాని ఆర్థిక స్వాతంత్ర్యం

అందరికి సమానమయి శాంతిసౌభాగ్య సౌఖ్యాలు సంపకూరవు.

ధర్మ : ఆమాట నిజం...పాపం ఈ అమర్‌నాథ్‌తండ్రి శంకర రావుగారు ఎప్పుడో తమపాలి రైతులికి పండినపంటలో సగంపాలు పంచిపెట్టేవారు సుమా !

ప్రభా : అందుకే! అమర్‌నాథ్‌కూడా తండ్రిగారిబుద్ధిని పుణికి పుచ్చుకున్నారు.

ధర్మ : కాక, రత్నాలగనిలో రాళ్లు పుడతాయా ?

ప్రభా : అయితే! నాన్నగారు! అమర్‌నాథ్‌తండ్రిగారు కలరా సోకి చనిపోయిన అయిదుగంటల్లోగా తల్లిగారుకూడా...

ధర్మ : అవునమ్మా! భర్తృవియోగాన్ని భరించలేక పాపం ఆ సాధ్వీమణికూడ స్వర్గసురాలయింది.

ప్రభా : విధివ్రాసిన వ్రాత యెవరికయినా తప్పదుగదండి,నాన్న గారు!

ధర్మ : అవునమ్మా! ఆ పుణ్యదంపతులు పోయేసరికి అమర్ నాథునికి అయిదేండ్లుకూడా వుండవేమో!

ప్రభా : కాబట్టే శ్రీహరిరావుగారి పందిట్లో పానకవర్షంపడుతూ వుంది.

ధర్మ : "చెట్టుపాతేవాడొకడు పండుతినేవాడు మరొకడూ" అని సామ్యం పూరికేరాలేదుగా? అన్నయ్య ఎక్కడికి వెళ్ళేడు?

ప్రభా : ఇప్పుడే వస్తానంటూ యీ పుస్తకాలు ఇచ్చుటపెట్టి వెళ్ళేడు నాన్నగారు !

ధర్మ : (లేచి) పొలంవెళ్ళి వస్తాను. అన్నయ్య రాగానే పూలమొక్కలికి నీళ్ళు పోయమని చెప్పు. (వెళ్ళును)

ప్రభా : (లేచి) అలాగే నాన్నగారు (కూర్చొని పుస్తకంవిప్పి)

సీ॥ రేబవల్ గష్టించి, యాబాల గోపాల
మున కన్నమును బెట్టు, ఘనుఁడు రైతు
ఘాసంబుమేపి, గోగణమును బోషించి
పాలనొసంగెడు, వాఁడు రైతు
పాదపంబుల, నాటి, ఫలశాకముల, సదా
గ్రామంబులకుఁ, బంపు రాజు రైతు
సర్వవస్తూత్పత్తి శ్రమకోర్చి చేకూర్చి
వర్తకులను బెంచు ప్రభువు రైతు
తే॥ అట్టిలోకైక, పోషకుం, డైన రైతు
రత్నగర్భయన్, పేరున, రాణకెక్కి
నట్టి, భరతావనీ, పుత్రుఁడైన రైతు
ధన్యతముఁడని పలుకంగఁ దగును గాదె ?

భాస్క : (ప్రవేశిస్తూ) ఆ పద్యంలో రైతు ఆధిక్యత గురించి అమర్నాథ్ యెంత అద్భుతంగా చిత్రించేడో ! చూసేవా ? చెల్లాయి !

ప్రభా : (చూచి) అవునన్నాయ్ !

భాస్క : (కుర్చీలో కూర్చొని) ఏది ? చెల్లాయ్ ! ఆ పదివ పేజీ తీసిచదువు.

ప్రభా : (తీసిచదువును) జగద్గురువయిన గాంధీమహాత్ముని అహింసా పూర్వక సత్యాగ్రహ తారకమంత్రం ద్వారా మనకు 1947 ఆగష్టు 15 వ తేదీని ఉదయవేళ స్వరాజ్యం అవతరించి 1950 జనవరి 26వ తేదీనుంచి సంపూర్ణ స్వపరిపాలనాధికారం యేర్పడింది కాని అధికారగర్వో న్మత్తులయిన శాసకుల అప్రతిష్ఠకర ప్రవర్తన ఫలితం గాను, ధనమదాంధులయిన ధనికవర్గపు దోపిడీ విధానం మూలంగాను, నోరున్నవారిదే రాజ్యం, నొల్లుకున్న వారిదే భూమి అయిపోయి ప్రజాస్వామ్య ఫలితం ప్రజానీకానికి అంతకు సమానంగా సమకూరక శాసన శకటం వక్రగమనాని కుపక్రమించింది.

భాస్క : అవును చెల్లాయ్ ! ఆమాట శిలాక్షరం అని శిరసావ హించక తప్పదు. అన్యాయపరులయిన అధికార్లు, స్వార్థపరులయిన పూంజీపతులు, ప్రజాద్రోహులయి ప్రవర్తిస్తూ వుంటే ! శాసన శకటం, సక్రమంగా ముందుకు యెలాసాగిపో గలుగుతుంది ?

ప్రభా : అంచేత, ప్రజలు ప్రభుత్వోద్యోగుల్ని, లోకసభా శాసనసభా సభ్యుల్ని, మంత్రుల్ని, వేయికండ్లతో, పీక్షిస్తూ, యెప్పటి కప్పుడు, గుణపాఠం చెబుతూ, వుంటే ! పల్లెల్లోను పట్నాల్లోను ప్రళయతాండవం, చేస్తూ పైత్యరోగంలా ప్రబలమయి పోతూవున్న

త్రాగుబోతుతనం, నీటిమీది నూనెబొట్టులా నలు మూలల అలుముకుంటూవున్న బ్లాక్ మార్కెట్టు నేరం, అంటురోగంలా ఆవహించిన లంచ్గొండితనం నిశ్శేషంగా నిర్మూలంకాక నిలుస్తాయా ?

భాస్క : అవును. అప్పుడుగానీ... ..

ప్రభా : ప్రజలికి ప్రభుత్వానికి కమ్యూనిటీ ప్రాజెక్టులవయిన, జాతీయవిస్తరణ కార్యక్రమాలవయిన, యేకైకలక్ష్యం యేర్పడి, మనకు వచ్చిన, స్వరాజ్యం, రామ రాజ్యంలా రాణించదు.

భాస్క : కాదుమరి ? ప్రజాసహకార సారథ్యాన్ని అనుసరిం చేగా ? ప్రభుత్వరథం సక్రమంగానైనా వక్రంగా నయినా ప్రయాణం చేయడం ?

ప్రభా : కనుక ప్రజలే పంచాయతీసభ్యుల్ని మొదలుకుని పార్లమెంటు సభ్యులవరకు వారివారి నిత్యకృత్యాల్లో సత్ప్రవర్తనం స్వార్థరాహిత్యం, సహనం, సాహసం, మొదలగు వాటినిచూచి, యెన్నుకున్ననాడు, దేశీయార్థికసాంస్కృతికవ్యవస్థాపునరుజ్జీవనవాంఛాయుత మయిన ప్రజాభిప్రాయమే, ప్రభుత్వానికి, కూడా ప్రధానలక్ష్యమయి దేశం వైజ్ఞానికంగా, పారిశ్రామి కంగా, ఆర్థికంగా అభివృద్ధి పొందగలుగుతుంది.

భాస్క : తప్పకుండాను. అప్పుడుగాని కట్టిపెట్టినందార్ల గద్దె
పొంకాలు గంగపాలయి ప్రతివ్యక్తికి పంచభూతాల్లో
సమానభాగస్వామ్యం సమకూరదు. (జ్ఞప్తిపినభినయించి)
నాన్నగారవ్వుడే పొలం వెళ్ళారా? చెల్లాయ్!

ప్రభా : (పుస్తకంమూసి) అవునన్నాయ్!
నిన్న పూలమొక్కలికి నీళ్ళుపోయమన్నారు.

భాస్క : సరే! పాడిఆవును పచ్చికబీడులోకట్టి వస్తాను.
యీలోపున అమర్‌నాథ్‌వస్తే, నేవచ్చేవరకు వుండమని
చెప్పు (లేచి రెండడుగులు ముందుకు వేసిచూచి) అదుగో!
అమర్‌నాథ్ తానన్న ప్రకారం రానేవచ్చాడు.

(ఇద్దరు యెదురు వెళ్ళుదురు)

అమ : (నవ్వుచు ప్రవేశించి) అన్న చెల్లెండ్రిద్దరు యేదో చదువు
కుంటున్నట్టున్నారు !

భాస్క : అవును నీరామరాజ్యం మా చెల్లాయి చదువుతూ
వుంటే! వింటున్నాను.

(ముగ్గురు కూర్చుందురు.)

ప్రభా : మహాత్ములూరకేరారు.............

భాస్క : (అందుకుని) వచ్చినమహాత్ములికి మాటలతోనే నా
చెల్లాయ్! మర్యాదచేయడం?

అమ : (చిరునవ్వుతో) ఆహ్వానించి ఆసనం యిచ్చేరుగా !
అంతకంటే యింకేంచేయాలి? మర్యాద?

భాస్క : ఇంటికివచ్చిన అతిథికి కాస్తకాఫీ యివ్వడం యీకాలంలో ఘనమైన గౌరవం అయిందిగా?

ప్రభా : (చిరునవ్వుతో) అయితే తీసుకొస్తాను. (లేచును)

అమ : ఇంటివద్ద యిప్పుడే కాఫీ త్రాగి బయలుదేరేను.

భాస్క : ఇప్పుడే మానాన్నగారు పొలంవెళ్లేరట అయిదయ్యేసరికి వస్తారు యీలోపున కాస్త మా కాఫీసేవించి మాతోటలో షికారుచేస్తూవుండు. నాకుకూడా పని వుంది. యిప్పుడే వస్తాను. (వెళ్లును)

ప్రభా : (చిరునవ్వుతో) అమర్‌నాథ్! కాఫీతీసుకునివస్తా కూర్చోండి (లేచును)

అమ : వద్దు! వద్దు! యిప్పుడే,గా? కాఫీత్రాగి బయలుదేరింది?

ప్రభా : (చిరునవ్వుతో) కాఫీత్రాగితే కడుపునిండుతుందంటారా?

అమ : (నవ్వుతూ) కడుపునిండకపోతేమాత్రం దేనికయినా కాలవ్యవధి వుండాలిగా?

ప్రభా : కాఫీ యేమీఘనపదార్థంకాదులెండి!

అమ : సరే! కాదుకూడదంటే బాగుంటుందా?

ప్రభా : సంతోషం (వెళ్లును)

అమ : ఆహాహా! యీ ప్రభావతి నవయౌవనాగత సౌందర్యం అపూర్వం! అనన్య స్త్రీసామాన్యం!

సీ॥ పూర్ణేందునిరసించుఁ బూఁబోడి నెమ్మోము
మారుఁ దూపు జయించు మగువచూపు.
తిలసుమంబుహసించు, నలివేణి నాసిక
పగడంబునోడించుఁ బడఁతి మోవి
వెన్నెలఁబాలించు, వెలఁదుక చిరునవ్వు
పికవాణి నణఁగించు, కలఁదిపలుకు
పూఁదండలనుమించుఁ, బాలతుక కరములు
కరికరంబుల నొంచుఁ గలికి కాళ్ళు
తే॥ పుటమువేసిన కనకంపుఁ బొలుపుమీరుఁ
దలిరుఁబోడి, యొడలి డాలు, ధరణియందు
నిట్టిసర్వాంగ, సుందరి, యెందుఁగూడ
గతము, లేదిప్పు, డైనను, గానరాదు.

ప్రభా : (కాఫీతీసికొని ప్రవేశించును)

అమ : (నవ్వుతూ) శ్రమయెందుకంటే ఒప్పుకున్నావుకాదు (కాఫీతీసికొనును)

ప్రభా : ఇంతమాత్రానికే శ్రమ అంటారా? ఈ రాత్రిభోజనం కూడా.........

అమ : (నవ్వుతూ) అలాంటి యేర్పాటు యేమీచేయవద్దు సుమా!.........

ప్రభా: (నిరుత్సాహంగా) అవునులెండి! పేదవారియింట భోజనం భాగ్యవంతులయిన మీకు.........

అమ : ఎంతమాట! భాగ్యవంతులయితేమాత్రం బంగారం తింటారా? నీ అనుగ్రహంవుంటే మీ యింట భోజనాలు చేసేరోజులెన్నో వున్నాయ్

ప్రభా : (సందేహంతో) నా అనుగ్రహమా? దేనికి? అమర్ నాథ్!

అమ : (కాఫీకప్పుకిందపెట్టి) చెప్పమంటావా?

ప్రభా : చెప్పాలి?

అమ : (నవ్వుతూ) మద్రాసునుంచి చదువు పూర్తి చేసుకుని వచ్చేక, నిన్ను ఎన్నోసార్లు ఒక అమూల్య వస్తువు, నడగాలని అడగలేకపోయేను.

ప్రభా : ఆజ్ఞాకారుల్ని అడగలేకపోవడం దేనికంటారు?

అమ : అడిగి వీల్లేదనిపించుకోవడం.........

ప్రభా : వీల్లేదని మేము ఏ చెరువు నీకుత్రాగ గలమంటారు?

అమ : ప్రాధేయపూర్వకంగా అడిగేవస్తువును శాసించి అడిగే అధికారం నాకెక్కడిది ప్రభా!

ప్రభా : అంత అనుగ్రహం మామీదవుంటే......

అమ : (నవ్వుతూ) అడిగిలేదనిపించుకోమంటావ్! అంతేగా?

ప్రభా : నేనివ్వగల వస్తువుని ప్రాణముండగా లేదనను.

అమ : నాచేతిలో చేయివేసి......

ప్రభా : ప్రమాణం చేయమంటారు!

అమ : అవును

ప్రభా : (నవ్వుతూ) సరే! (అమర్ నాథ్ చేతిలో చేయి వేయును)

అమ : (సంతోషంతో) (ప్రభావతిచేయిపట్టుకొని) ప్రభావతి! నీ క్షేమాపహారకంటే నాకు కావలసిందేముంది?

ప్రభా : (కలికిపడి) అది సాధ్యమా? అమర్‌నాథ్!

అమ : (నిరుత్సాహంగా) ఇంతమాత్రానికేనా? కోరుకో మన్నాను!

ప్రభా : (చిరునవ్వుతో) కాలప్రవాహానికెదురీదడం.........

అమ : సాధ్యం కాదంటావ్!

ప్రభా : అవ్రతుం దంటారా?

అమ : అంత ఆత్మస్వాతంత్ర్యంలేనిదానవు నాచేతిలో యెందుకు చేయి వేశేవ్!

ప్రభా : (చిరునవ్వుతో) పెద్దలచాటువారిమాట......

అమ : చెల్లదనా? నీసంశయం?

ప్రభా : ఎలా చెల్లుతుందంటారు?

అమ : వ్యక్తిస్వాతంత్ర్యమున్నవారిమాట యెందుకని చెల్లదో! చెప్పు!

ప్రభా : అంతరం తెలియకుండా మాట్లాడుతున్నారు.

అమ : అది అర్థంలేనిమాట

ప్రభా : కాదు. పాతికేకరాలవంటభూమిగాని పాతికవేల రూపాయలుగాని యిస్తామంటూ ప్రతిరోజూ పదిమంది మీ యింటపడుగాపులు పడి వుంటూవుంటే?...

అమ : (నిర్లక్ష్యంగా) పడివుంటేః?

ప్రభా : పదియెకరాలు పాలిపొలం చేసుకునే మానాన్నగారు మీకేంవరకట్నం ఇచ్చినన్ను పెండ్లిచేస్తారు? చెప్పండి!

అమ : (నవ్వి) ఓహో! యిదా నీసందేహం?

ప్రభా : సందేహమేకాదు సాగనివనికూడాను

అమ : స్త్రీపురుషుల జీవితానందానికి జీవగఱ్ఱ ప్రేమగాని ధనం కాదు తెలుసా?

ప్రభా: కబుర్లకి కార్యాలికి కావలసినంత తేడా వుంటుందిలెండి!

అమ : అయితే! సనాతన సంస్కృతి ననుసరించి కట్నాలిచ్చి కట్టబెట్టితేగాని కన్యాదానం ఫలప్రదంకాదా?

ప్రభా : ఈరోజుల్లో సిరిరామోకాలడ్డే త్యాగజీవులెవరున్నారంటారు?

అమ : అందుకు అందరు అత్తవారిచ్చే కట్నాలకు ఆశించి తమ ఆశయాల్తో యేకీభవించని యేకన్యనయినా వివాహమాడతా రనేనా నీవనేది?

ప్రభా : ఆడక పెద్దవాళ్ళమాట త్రోసిరాజని పిన్నలు యేం చేయగలరు?

అమ : ఈరోజుల్లో పెండ్లివిషయమయి పెద్దల పెత్తనం మాత్రం......

ప్రభా : పనికి రాదంటారు?

అమ : పనికిరాదనడమే కాదు సాగనివ్వను కూడానూ.

ప్రభా : నిజంగా నేనా?

అమ : వసంతమల్లికా ప్రసవంలా ప్రణయసౌరభాన్ని వెద జల్లుతూ బాహ్యసౌందర్యంతో బాటు హృదయ సౌంద ర్యంకూడా కలిగి నన్ను ఒక వెలుగుబాటలో నడిపింపగల నిన్నుతప్ప నాకీజన్మలో పెళ్లాడే భాగ్యముంటే మరి యొకర్ని వివాహంకూడా ఆడనంటాను.

ప్రభా : (చిరునవ్వుతో) అది మీగృహకలహానికి కారణ మయితే........

అమ : ఏమయినాకానియ్! నానిర్ణయానికి మాత్రం తిరుగు లేదు. ఇదిగో నీవుసరే! అంటే! ఇప్పుడే మనప్రణయ సామ్రాజ్యానికి పతాకంగా నాయీ అంగుళీకాన్ని నీకు అరణంగా యిస్తాను. (తనవ్రేలివుంగరంతీసి ప్రభా వతి వ్రేలికి పెట్టును.)

ప్రభా : అర్ధాంగిగా నన్నేమి చూచి మీరు అంగీకరించేది?

అమర్ : చెప్పమంటావా ?

సీ॥ సర్వప్రజాహ్లాద, సంధాయకంబైన
హృద్యైక, గాంధర్వ, విద్యవీవు
మూర్తిమంతంబౌచు, మోహనాకారత
రాజిల్లు శృంగార, రసమవీవు

భువనత్రయ, జయేచ్ఛఁ, బుష్పధనుర్ముక్త
కామాస్త్రరూప, శరంబవీవు
ప్రణయ సందేశంబుఁ బంపుటకై పెంచుఁ
జిత్తసంభవునిచే జీవికవీవు
తే. మేల్మిబంగారమును సుధామిళితముఁ జేసి ప్రాణంబులంబోసి చేడిఁజేసె
కనదు నైపుణ్యమును లోకమునకుఁ జూపు
సృష్టికర్తృకృతా పూర్వసృష్టి వీవు.

ప్రభా : ఇదంతా మీ మనోభావన గాని నాలో మీరన్న....

అమర్ : గుణాలు లేవంటావ్ ! కాని గులాబీకి తన గుబాళింపు ఎలా తెలుస్తుందిలే ?

ప్రభా : (ఆనందంతో) ఆగర్భ శ్రీమంతులు సౌందర్య తేజోమూర్తులు అయిన మీకు నా ప్రేమజ్యోతులతో, నివాళీయడం కంటే నాజన్మకు సార్థకత యేముంటుంది ?

అమర్ : అమృతభాండంలాంటి నీవు అర్ధాంగలక్ష్మి వగుట కంటే నాకుమాత్రం కావలసిందేముంది చెప్పు ? (తన చేతివాచి చూచుకొని) అబ్బా ! అప్పుడే అయిదు కావచ్చిందే ?

ప్రభా : (భాస్కరరావు రాక చూచి) మా అన్నాయి వస్తున్నాడు.

అమర్ : (చూచి) భాస్కరరావ్ ! మీ నాన్నగారు రావడం లేదా ?

భాస్క ! (సమీపించి) అంత తొందరపడతావేం ? అమర్ ?
మైలు దూరం వెళ్ళలేకపోతావా ?

అమర్ : వెళ్లలేక పోతానని కాదు యింటివద్ద యింకాయెన్నో
పనులున్నాయి నీకు తెలియందేముంది ?

ప్రభా : (ధర్మయ్యగారిని చూచి) అదుగో ! మానాన్నగారు
కూడా వస్తున్నారు.

భాస్క : ఇంకేం ? మాట్లాడుతూ వుండు. దొడ్డిలోనికి వెళ్ళి
యిప్పుడే వస్తాను.

ధర్మ : (ప్రవేశించి) ఎంతసేపయింది బాబు ! నీవు వచ్చి ?

అమర్ : నమస్కారం ధర్మయ్యగారు! గంటలోపు అవుతుందండి.

ధర్మ : ఏదో పనిమీదగాని గావు.... ..

అమర్ : మొన్న మీతో మనవిచేసిన కార్యాల గురించి....

ధర్మ : అదా ? మీ తలిదండ్రుల పేర కట్టించాలన్న భవనాల
గురించేగా ?

అమర్ : అవునండి మీ వేదోడు వాదోడువుంటేనే గాని.....

ధర్మ : తప్పకుండా ? దానికేం ? బాబు !

అమర్ : నాపేర నున్న లక్షరూపాయలు......

ధర్మ : బ్యాంకువారు ఇస్తామన్నారా ?

అమర్ : ఇవ్వడానికే మీ అభ్యంతరం ఉండదన్నారండి.

ధర్మ : కాని...యీ భవనాల నిర్మాణం మీ మామగారికి
ఇష్టమేనా ?

భాస్క : (వస్తూ) వడ్డీకి వడ్డీలు కట్టించి తానిచ్చిన సొమ్ముకి రెట్టింపు గుంజుకోవడం తప్ప వీని మామగారు సత్కార్యాలు చేయడానికి సమ్మతిస్తారా? నాన్నగారు!

ప్రభా : సమ్మతించక పోవడానికి వారి కష్టార్జితమేమీ కాదుగా? అది ?

ధర్మ : కాకపోతేమాత్రం ? పిల్లికి బిచ్చం పెట్టని పిసినారికి యింతసొమ్ము ఖర్చుచేయడానికి ఎలా వొప్పుదల అవుతుంది ?

అమర్ : ఒప్పుకోరనే గదండి ? ఆర్థిక విషయం తెలియనీయకుండా కట్టించడం ?

ధర్మ : చిత్రగుప్తుడు లాంటి గణపతిగారు తన చెంతనున్నంత కాలం శ్రీహరిరావుగారికి తెలియనీయక పోవడం సర్వేశ్వరునికి కూడా సాధ్యం కాదేమో !

అమర్ : సాధ్యంకాక పోవడానికి యువజన సంఘంవారు చందాలు వసూలుచేసి, కట్టిస్తున్నట్టే గాని నాపేరేమీ వుండదు ? గదండి.

ధర్మ : అట్లాగయితే తప్ప, నీవు తలపెట్టిన యీ మహాకార్యం సాంతంగా సఫలం కాదు. బాబు !

అమర్ : రేణ్ణెళ్ళపాటు మీ భాస్కరరావుని మాకు సహాకారంగా పంపించే రంటే......

ధర్మ : అంతకంటేనా ? మానవసేవే మాధవసేవగా యెంచి పదిమందికి ఉపకరించేపన్లు చేసే నీకు మేము ఆమాత్రం తోడ్పడలేమా ? తప్పక తీసుకుని వెళ్లు బాబు !

అమర్ : అదే పదివేలు. రేపట్నుంచి పంపించండి.

ధర్మ : సరే ! రేపు వర్షం లేకుండా చూచి వస్తాడులే !

అమర్ : నమస్కారం నాకిక శెలవిస్తారా ? (లేచును)

ధర్మ : వెళ్ళిరా బాబు !

అమర్ : (ప్రభావతిని ఓరగంట చూచి వెళ్ళును)

ధర్మ : వయస్సుచేత చిన్నవాడయినా ఉన్నతాశయాలు గల వాడయ్యేడు అప్పుడే !

(అందరు వెళ్ళుదురు)

(తెరపడును)

శ్రీః

# కన్నకూతురు

[పంచమదృశ్యం]

(గణపతి ఇల్లు, చావడిలోని కుర్చీమీద కూర్చొని భాస్కరరావు పుస్తకం చదువుతూ వుండును.)

సీ॥ స్వాచరణోచితా చార్యుండ వైనచో,
నన్యోపదేశార్హుఁ డగుదువీవు
నిర్జితషడ్వర్గ, నీచారి వైనచో
నరిదుర్జయుండవే, యగుదువీవు
స్వధనైకతృప్తను, స్వాంతుండ వైనచో
సప్తసంపద్యుక్తుఁ డగుదువీవు
పక్షపాతరహిత భావుండ వైనచో
నఖిలన్నమిత్రుండ, వగుదువీవు.

తే॥ వేదశాస్త్రార్థభావైక వేదివైన
శత్రుదుర్జయ, సామర్థ్య, శాలివైన
భవ్యసర్వంసహా, చక్రవర్తివైన
వాక్యచతురుండవైన, లాభంబులేదు.

గణ : (ప్రవేశిస్తూ చూచి) అరే! వీడి తస్సాదియ్యా! ప్రొద్దుటే శనిగాడిలా దాపరించే డేమిటి? (సమీపించి) భాస్కరరావా ? ఎప్పుడు వచ్చావ్ ! బాబు !

భాస్క : (లేచి) మీరా? దయచేసేరూ? పనులన్నీ సక్రమంగా తెముల్చుకునే వచ్చారా?

గణ : కాని కలిసివచ్చే పనులికి కాదుగా మేంపడే కడగండ్లు?

భాస్క : (వెగటుగా నవ్వి) కలిసివచ్చే పనులికి కాకపోతే! మీరు గడపదాటి కాలు అవల పెడతారా?

గణ : దానికేంగాని? ఎప్పుడు వచ్చేవో! చెప్పేవుకాదు.

భాస్క : మీ కనకారావు అర్జంటుగా రమ్మని కబురుచేస్తే! నిన్నే వచ్చాను.

గణ : (సందేహంతో) నిన్నే వచ్చావూ?

భాస్క : వచ్చి వూరికే కూర్చొనివున్నా ననుకున్నారా?

గణ : కూర్చొనివుండక నీవుచేసిన ఘనకార్యం ఏమిటో! కాస్త చెప్పు?

భాస్క : దేవాలయ ధర్మకర్తలయిన మీ శ్రీహరిరావుగారు గుడికి గుమస్తాగిరి చేసే మీరు, కలిసి పదేండ్లనుంచి గ్రామచరిత్రలో కలకాలం పేరుండేలా చేస్తూ వుండే ఘనకార్యాల్ని కండ్లారా చూస్తూ.........

గణ : కాలక్షేపం చేసేవన్నమాట.

భాస్క : కాదు, హృదయాలు లేకుండా మీరు చేసిన దారుణ కార్యాల్ని చూచి మీవుద్యోగాలూడదీసే ముహూర్తం యెప్పుడు వస్తుందా అని వూహిస్తూ గడిపేను కాలం.

గణ : (కంగారుపడి) మేమేం చేయరాని కార్యాలు చేసేమని నీవు చెప్పేది?

భాస్క : మీరుచేసిన ఘనకార్యాలు కలంతీసుకుని వ్రాసే కవి వుంటే! వందపేజీల గ్రంథమవుతుంది.

గణ : అదేదో నీవు సంక్షిప్తంగా యిప్పుడుచెప్పకూడదూ!

భాస్క : సరే! చెబుతాను సావకాశంగా కూర్చోండి కుర్చీలో

గణ : (కూర్చొని) చెప్పు, మేంచేసిన చెడుకార్యాలేమిటో! మరి ?

భాస్క : (కూర్చొని) లెక్కపెట్టండి. ప్రతిరోజూ పలువురు ఫలమో! పత్రియో! పట్టుకునివచ్చి భక్తిశ్రద్ధల్తో ప్రార్థనచేసుకునే పరమేశ్వరుని ప్రార్థనామందిరాన్ని సరిగా ధూపదీప నైవేద్యాలు లేకుండా చేయించి దయ్యాలకొంపలా తయ్యారు చేసేరా ? లేదా?

గణ : మేమా చేసింది?

భాస్క : చెప్పేవన్నీ సాంతంగావిని సమాధానం తరువాత చెప్పండి.

గణ : సరే! కానీ.

భాస్క : శ్రవణానందంగా ప్రతిపర్వపురోజుల్లోను యే పుణ్య కథాశ్రవణమో, చేయిస్తూ, వుండే కళామందిరాన్ని చూడడానికి అసహ్యంగావుండే జూదపుశాలగాచేసింది మీరు కాదా?

గణ : (కోపంగా) మతిచెడి మాటాడుతున్నావ్!

భాస్క : (సాక్షేపణగా) కాదులెండి! ఇంకా వినండి. పుణ్యక్షేత్రమని పొరుగూళ్ళనుంచి వచ్చే యాత్రికుల, సౌకర్యార్థం యే పుణ్యాత్ముడో కట్టించియిచ్చిన ధర్మశాలని దొంగకల్లు అమ్మేదుకాణంగా చేసిం దెవరంటారు?

గణ : అన్యాయంగా మామీద అభాండాలుమోపి పాపాల్ని ఒడికట్టు కుంటున్నావ్!

భాస్క ! మీ శాపాలు కేంగాని? కూలిపోవడానికి సిద్ధంగావున్న గోపురాన్ని గోరెడు సున్నమయినా పూయించకుండా గబ్బిలాయిల్ని కాపురంపెట్టించి గొబ్బికంబు పెట్టే దాన్నిగా విడిచిపెట్టడం వట్టిమాటంటూ రా?

గణ : (గట్టిగా) గట్టిమాటామరి?

భాస్క : ఆగండి! తీర్థపురోజుల్లో స్నానపానాదులుచేసే కోనేటిని మురికిగుడ్డ ల్నుతికించి దున్నపోతుల్ని తోలించి కాళ్ళుకడగడానికికూడా పనికిరాని కుళ్ళుగుంటగా చేయించేరు. ఒవ్వుకుంటూరా?

గణ : (కోపంతో) మిగతా గ్రామస్థు ల్లి లేనిబాధ్యత మాకా వాలా?

భాస్క : అంత గ్రామస్థుల్నికి అనువులో పెట్టలేనివారికి అధికారాలెందుకు? యింకావినండి. గుళ్ళచుట్టూకోటగోడలా కొండనంటుకుంటున్న ప్రహరీ పడిపోతూవుంటే జారిపోయిన యిటుకల్ని అర్ధరాత్రివేళ యిళ్ళకు జారే

యించుకుని దూడలసాలకు గోడలు కట్టించుకోవడం
మీకు కావల్సింది కాబోల్నే?

గణ : రాతిగోడలుకట్టిస్తున్నాం గనుక యిటుకిల్నిలా వుపయో
గించాం? ఏం?

భాస్క : ఇటుకిల్నిలా మీరు ఉపయోగించుకోవడం అడిగే
వారు లేకేగా?

గణ : అడిగే మహాశయులు గ్రామంలో ? మీరు బయలు
దేరేరుగా ?

భాస్క : బయలుదేరక మీ పప్పులు వుడకనిస్తా మనుకు
న్నారా ? యింక ?

గణ : సరే ! అయిందా ? నీ వుపన్యాసం ?

భాస్క : అవుతుందా ? ఇలా మీరుచేసే అన్యాయాల్ని
వ్రేళ్లుమడిచి చెప్పాలంటే యెన్నైనా వున్నాయి !

గణ : ఉంటే వూరుకున్నావేం ?

భాస్క : వూరుకోలేదు. పూర్వం ఘోరీ, గజనీలనే, వాళ్లి
ద్దఱు సోమనాథాలయం మొదలయిన వానిని చూర్ణం
చేసి దండోపాయంతో అమూల్య రత్నాభరణాల్ని
అపహరించి పట్టుకు పోయేరు. పాపం వారిలా కాక ?

గణ : కాక ? యేంచేశేం ?

భాస్క : పాపం మీకు వస్త్రాత్రం సామోపాయంగానే యేటా
యేటా ఖైమొకరాల్లో వండే వంటల్ని మీ వరం చేసు

కుంటూ, దినదినమూ దేవునికి వచ్చే ముడుపుల్ని మూటగట్టుకుంటూ ఆదాయంలో అరవైవొంతు యిన దేవునిక్రింద ఖర్చుపెట్టే పాపానికి పాల్పడ్డంలేదు. ఇంకా ఏంచేయాలి?

గణ : (కోపంతో) ఎవడయ్యా నీకీ విషయం చెప్పిన చాదస్తుడు ?

భాస్క : ప్రత్యక్షంగా కనపడే విషయాలికి సాక్ష్యాలు కావాలంటారా ?

గణ : కావాలనకపోతే లేనిపోని పాపాల్ని మానెత్తిని రుద్దుతావా ?

భాస్క : ఆవిషయం అట్లావుంచండి ! యీామధ్య మాయువజన సంఘం వారిని విమర్శిస్తూ వుపన్యాసాలిస్తున్నారట మీరాలా మేమేమి అన్యాయాలు చేస్తున్నామని ?

గణ : పెద్దా పిన్నా తారతమ్యం లేకుండా ప్రవర్తించడం మీకు... ...

భాస్క : భావ్యంకాదంటారు. అవునా ?

గణ : అవును.

భాస్క : పెద్దలంటే ! మీపరిభాష శ్రీమంతులనేగా ?

గణ : శ్రీమంతుల్ని చెందనాడ్డం మాత్రం చెడ్డకాదంటావా?

భాస్క : చెల్లుబడి అవుతూవుందని శ్రీమంతులు ఎంత అమానుషంగా ప్రవర్తిస్తూవున్నా అదేమిటనడం అన్యాయమంటారు ?

గణ : (విసుగుదలగా) కయ్యానికి కాలుద్రువ్వడానికి కాకపోతే! మా గొడవలు మీకెందుకు ?

భాస్క : కయ్యానికి కాలుద్రువ్వేది మీరా మేమా ?

గణ : కనబడుతూ వుందిగా ?

భాస్క : ఎందుకు కనబడదు ? పాతపంచాయతీ ప్రసిడెంటు గారు మీతో "ఈ పర్యాయానికి పంచాయతీ బోర్డు పరిపాలన యువజన సంఘం వారికి ఇద్దా" మంటే మీరు, శ్రీహరిరావుగారు వీల్లేదన్నారటగా ?

గణ : ఎందు కన్నామంటావ్ ?

భాస్క : ఎందుకా ? దేవాలయ ధర్మకర్తలయి వూరి కీపదేండ్లలో చేసిన వుపకారాలికి పడీగా పదిమందికి ఉపకరిస్తూవున్న బావుల్ని చెరువుల్ని పాడుచేయించి ప్రజలికి పరమోపకారం చేయాలని భావించేరు కనుక.

గణ : శాసన విధానం సరిగా తెలియని మీ యువజన సంఘం వారు ఉద్యోగస్థులయి వూరునుద్ధరిస్తారా ?

భాస్క : అదా ! విషయం ? శాసనవిధానం చక్కగా తెలుసున్న మీలాటివారు యే యాభై వేలు రూపాయలో ఖర్చుపెట్టి యేశాసన సభాసభ్యులో, లోకసభా సభ్యులో మంత్రులో అయ్యి కాటన్‌దొరగారు కష్టపడి కట్టించిన ఆనకట్టల్ని పడగొట్టించి దేశానికి ఈతిండి గుడ్డా లేకుండా చేసి మీకడుపుమంట చల్లార్చుకోరాదూ!

గణ : నీయెత్తిపొడుపు మాటలకేం గాని మా శ్రీహరిరావు గారు చేసిన దేశసేవ, చిన్నవాడవు, నీకేం తెలుసు ?

భాస్క : అవును. శ్రీహరిరావుగారు వదేళ్ళక్రితం జస్టిసుపార్టీ నాయకులుగా వుండి యింగ్లీషువాళ్ళ మోచేతినీళ్లు త్రాగుతూ కాంగ్రేసు నాయకులంటే కారాలు మిరియాలునూరి కాలం గిర్రున తిరిగి కాంగ్రెసు నాయకులు గద్దె లెక్కడంతో, కలిసివచ్చేటట్టు కనబడి......

గణ : కనబడి యేంచేసేరు?

భాస్క: ఊసరవిల్లి రంగులు మార్చినట్లు మిల్లుబట్టలు పెట్టెలో పెట్టి ఖద్దరుబట్టలు కట్టుకున్నారు.

గణ : ఊ! కట్టుకుంటే? నష్టం యేంవచ్చింది.

భాస్క : ఏం వచ్చిందంటావా? "కట్టేవి ఖద్దరుబట్టలు కొట్టేవి బీదలపొట్టలూ"అని కరువుకాటకాల్తో కల్లోలంగావుండే కాలంలో పాలకుల బాసటతో ప్రతి తినుబండారానికి పరిమిట్లు సంపాదించుకుని అర్ధరూపాయి వస్తువుని అయిదురూపాయలకి అమ్ముకున్నారు. కాదంటావా?

గణ : అందరికి అందుబాటులో లేని ఆహారపదార్థాల్ని ఆ గడ్డు రోజుల్లో, నానాగడ్డి కరిచి సంపాదించి యేకొంతచేసి యివ్వడం కేవలం స్వార్థానికే అంటావు?

భాస్క : కాదు కాదు. అన్నమో! రామచంద్రా! అంటూ, అలమటిస్తూ అసువులు పోగొట్టుకుంటూవున్న అనా

థులవద్ద అణా నూకలికి అర్ధరూపాయి తీసుకోవడం కూడ పరమార్థానికే అనుకుంటాను.

గణ : కాక? ప్రజల ప్రాణాల్ని కాపాడ్డం పాపానికంటావా?

భాస్క : అమాయకుల్ని అన్యాయంచేసి ఆర్జించుకోవడం న్యాయంకాబోల్ను?

గణ : న్యాయమో, గీయమో, ఆరోజుల్లో అందరికీ ఆహార పదార్థాల్ని అందజేసి నందుకు ఆనందించాలి.

భాస్క : అందజేసేరు గనుకనే యెనిమిది ఎకరాలుగల శ్రీహరి రావుగారు యాభై యెకరాలు. పూటకి తికాణా లేని మీరు యీనాటికి పుట్టెడు భూమిని చేపట్ట గలిగేరు. కాదంటారా ?

గణ : సంపాదించుకున్న వారిని చూచి సహించలేక పోవడం మన భారతీయుల సంప్రదాయమేగా ?

భాస్క : కడుపులుకొట్టి గడించిన సొమ్ము హారతి కర్పూరంలా హరించి పోతుందని పాపం మీకు తెలియదు గదండి?

గణ : తెలియకపోవడానికి మేము ఎవరి కళ్ళకి గంతలు కట్టి, ఎప్పుడు వర్తకం చేసే మంటావ్ !

భాస్క : ఎప్పుడు మాటో యెందుకు ఇప్పుడు ఆదర్శమూర్తి అయిన అమర్‌నాథునికి అన్యాయం చేయడానికి యెందుకు అవలంబించేరు ? మీరు ?

గణ : ఇది శ్రీహరిరావుగారి యింటి విషయం.

భాస్క— : అంటే ! గోవులకోసి చెప్పులు దానం చేస్తామంటారు! ఉదేగా మీ మాటలోని సారాంశం ?

గణ : అంతే !

భాస్క— : అంటే ! మీ శ్రీహరిరావుగారు మేనల్లుని ఆస్తి నవ మారించి, పంచాయతీబోర్డు ప్రెశిడెంటులయి, వూళ్ళో వాళ్లని బాగుచేస్తారంటారు ? అదేగా మీరనేది ?

గణ : బాగుచేయడానికి మీయువజన సంఘంవారు. బయలు దేరేరుగా ?

భాస్క— : బయలుదేరక మీ నిరంకుశత్వాన్ని బలపరుస్తామను కుంటున్నారా ?

గణ : బలపరచమని మిమ్మల్నెవరూ బలవంతం చేయంలే బాబు ! సరేగానీ ! చూసేవా ? మాయింట్లో వాళ్ళ వరస ?

భాస్క— : మీయింట్లోవాళ్లు యేం చేసేరు ?

గణ : ఏం చేసేరా ? ఇంతసేపట్నుంచి మనం క్రిందా మీదా పడుతూవుంటే ఒక్కరయినా వచ్చి నామంచీ చెడ్డా చూసేరా ! చెప్పు ?

భాస్క— : చూడడానికి ఇంకా ఎవరూ రాలేదు గదండి !

గణ : (ఆశ్చర్యంగా) రాలేదు గదండీ ! రాకపోవడ మేమిటి ?

భాస్క— : ఊళ్లో లేరు గనుక!

గణ : ఊళ్ళో లేక కట్టగట్టుకుని కాశీయాత్రకు పోయారా ?

భాస్క : యాత్రకు కాదండి వెళ్ళింది. పెళ్ళికి.

గణ : పెళ్ళికి ? ఎవరింట్లో పెళ్ళికి ?

భాస్క : ఎవరింట్లో పెళ్ళికో అయితే ఇంటిలోని వారందఱు ఎందుకు వెళతారు?

గణ : నా కొడుకూ నీవు కలిసి ఏదో కుతంత్రం చేసేరేమిటి ?

భాస్క : కుతంత్రమో ! స్వతంత్రమో ! తరువాత చెబుతా గాని ముందు నామాటకి సూటిగా సమాధానం చెబుతారా ?

గణ : (విసుగ్గా) ఏమిటి నీకు చెప్పేది ?

భాస్క : ఏమిటంటారా ? మీపాపాయి జన్మదినోత్సవంనాడు "మా అమ్మాయిని మీ అబ్బాయికి పెండ్లిచేసుకోవాలని" మీ చెల్లెలుగారి చేతిలో చేయివేయించుకున్నారట నిజమేనా?

గణ : ఆగొడవంతా యిప్పుడెందుకు ?

భాస్క : ఆనాటికి పచ్చగావున్న మీ చెల్లెలుగారి పరిస్థితిని బట్టి శపథం చేయించుకుని యీనాటివారి లేమినిచూచి ప్లేటు ఫిరాయించదలచే రన్నమాట.

గణ : కాకపోతే ! పట్టుమని పదిబస్తాలు రాని వానికి పిల్లనిచ్చి వివాహం చేయడం వినోదానికా ?

భాస్క : వినోదానికి కాకపోతే వృద్ధుడయిన శ్రీహరిరావు గారికి వివాహం చేయడానికి సిద్ధపడ్డం మీ ప్రమోదనికా?

గణ : ప్రమోదానికి కాకపోతే! కలిగినవాణ్ణి పెండ్లాడి కష్ట పడుతుందంటావా ? మాపాపాయి.

భాస్క : కష్టపడితే మాత్రమేం లెండి ! మీకు కలిసి వస్తున్నప్పుడు ? మీ స్వార్థం కొలది మీకు పిల్లనిస్తామన్నా అరవై యేండ్లుదాటిన శ్రీహరిరావుగారు పెండ్లి చేసుకుంటా ననడంలో అర్థముందంటారా ?

గణ : లేదంటావా?

భాస్క : (వ్యంగ్యంగా) వుంది ఉంది. లేకపోలేదు. అది ఏమిటంటారా? మీ శ్రీహరిరావుగారు తన మొదటి పెండ్లికి ధర్మాన్ని, రెండవపెండ్లికి అర్థాన్ని, మూడవపెండ్లికి, కామాన్ని, యీనాలుగవ పెండ్లికి, మోక్షాన్ని, యిట్లావరుసగా ధర్మార్థకామమోక్షాల్ని సాధించుకోవడానికి సంకల్పించుకున్నారు.

గణ : (కోపంతో) చాల్లే! చక్కని అర్థంచెప్పేవ్.

భాస్క : ఉన్నమాటంటే! మీకంత కోపమెందుకు చెప్పండి?

గణ : కోపంకాకపోతే! శుభమా! అంటూ మాపాపాయినిచ్చి పెండ్లి చేయాలంటే అశుభవాక్యాలంటావేమిటి? అన్యాయంగా?

భాస్క : (చులకనగా) అన్యాయం? "గంగిగోవుని కసాయివానికి అమ్మినట్టు మెరుపుతీవెలాంటి మీ పాపాయిని మూడుకాళ్ళ ముసలోడికిచ్చి తూతూమంత్రంపెండ్లి చేస్తాననడం అన్యాయం కాదూ?

గణ : (కోపంగా) అదినాయిష్టం. మా అమ్మాయి కష్టసుఖా లు నాకు తెలుసులే!

భాస్క : తెలియకేం? ఆ వృద్ధఘటం హూశే! అనడంతో వాని ఐశ్వర్యాన్ని హస్తగతంచేసుకుని కన్నకూతుర్ని 'అలో లక్ష్మణా' అంటూ బ్రతికినంతకాలం అఘోరిస్తూ, మూలకూర్చోమని కోటీశ్వరులై కులకాలనుకోవడం బాగా తెలుసు.

గణ : హద్దుమీరి మాటాడుతున్నావు.

భాస్క : అలాఅయితే మీరాడిందాట పాడిందిపాటగా ఇంత కాలమెందుకు సాగుతుంది?

గణ : ఇంతకు నీ అరవకజ్జం దేనికి?

భాస్క : నా కజ్జం ఏముంది! అయిందేదో అయింది......

గణ : ఏమిటా అయింది?

భాస్క : మీ పాపాయిపెండ్లి .

గణ : నా బొందిలో ప్రాణముండగా కాదు.

భాస్క : అయితే! పునర్వివాహం చేస్తారా?

గణ : ఏమిటి నీ మాటలు?

భాస్క : అవునండి! రాత్రి మూడున్నరగంటలికి మీ మేనల్లునికి మీ అమ్మాయినిచ్చి మీకసకారావు కాళ్ళుకడిగి కన్యాదానంచేసేడు తెలిసిందా?

గణ : (కంగారుగా) ఆ! నిజమేనా?

భాస్క : అబద్ధమాడవలసిన అగత్యం యేంవచ్చింది?

గణ : (విచారంతో) మా కనకారావు యింతఘాతుక కార్యం చేస్తాడని కలలో అయినా అనుకోలేదు. పదిహేనేండ్ల క్రితం పాతిన నా ఆశావృక్షాన్ని నేటితో మొదలంట కూల్చివేసేడు. ఈ విషయాన్ని మా శ్రీహరిరావుగారికి యేముఖం పెట్టుకుని చెప్పను.

భాస్క : గాల్లో కట్టిన మేడలో, కాపురంచేయడం ఏ లె లా అవుతుందనుకున్నారు? మరి?

గణ : నా పూహాగానమంతా యీనాటితో ఆకాశహర్మ్య విహారం అయిపోయినట్టే. యింకేముంది?

(బండిచప్పుడు వినబడును.)

భాస్క . (విని) అదుగో! మీ కనకారావు. పెండ్లిచేసి మీ అల్లుణ్ణి కూతుర్ని బండిమీద అప్పుడే తీసుకునివచ్చేసేడు కూడాను.

గణ : (కోపంతో) సరే! రానీ! చూస్తాను.

భాస్క : ఏమిటి మీరుచూసేది? అనవసరంగా ఆగ్రహావేశంతో నేలవిడిచి సాముచేయక నవవధూవరుల్ని ఆశీర్వదించి మీ మర్యాద మీరు కాపాడుకోండి. లేవండి.

(ఇద్దఱు లేతురు)

(తెరపడును)

శ్రీః

# కన్యాకుమారు

## [ షష్ఠ దృశ్యం ]

(ధర్మయ్యగారి గృహోద్యానం అమర్‌నాథ్ ఫోటో చేతబట్టుకొని పాడుతూ ప్రభావతి ప్రవేశించును)

ప్రభా : (పాటను ముగించి) ఆహా! నా భావిభాగ్యోదయానికి ప్రథమ వసంతోత్సవంగా నన్ను మానసిక వివాహంచేసుకున్న యీ భామినీ పర్యాయ మన్మథుని మధురస్మృతి నా మనోవీణను హాయిగా మీటుతూ నన్నెంతపరవశురాల్ని చేస్తున్నది?

సీ॥ సంపదకనువైన సద్వ్యవహారంబు
వ్యవహారమున కనువైన విద్య
విద్యకునను వైన వినయస్వభావంబు
భావానికనువైన భవ్యబుద్ధి
బుద్ధికి ననువైన బోధన జ్ఞానంబు
జ్ఞానానికనువైన కార్యదీక్ష
దీక్షకునను వైన దాక్షిణ్యహృదయంబు
హృదయాని కనువైన యిద్ధశక్తి
తే॥ శక్తికనువైన సత్కార్యసాధనంబు
సాధనంబునకనువైన సఫలతయును
కలిగి త్రైలోక్యమోహనాకార గరిమ
వరలుచున్నాడు నామనోహరుడు భళిర.

అమ : (వెనుకబాటుగావచ్చి) ఎవరా మోహనాకారుడు?

ప్రభా : (ఫొటోదాచి సిగ్గుతో) మీరా?

అమ : అవును నేనే! ఏది! ఆఫొటో!

ప్రభా : (నవ్వుతూ) ఉహుం నేనివ్వను.

అమ : ఇవ్వాలి (లాగికొనును)

ప్రభా : ఏమిటి మీబలత్కారం?

అమ : (ఫొటోచూచి ఆశ్చర్యంతో) ఇది నా చిత్రపటమే! అయితే యింకేం? చిత్రనిర్మాణకళలోకూడా నీవు అందెవేసిన చేయివన్నమాట!

ప్రభా : (నవ్వుతూ) హృదయ ఫలకచిత్రితులయినవారి చిత్రాన్ని వ్రాయడంలో ఆశ్చర్యమేముంటుందండి!

అమ : (సంతోషంతో) అప్పుడే నీవు ప్రణయదేవతారాధనం కూడా ప్రారంభించినట్లున్నావునుమా!

ప్రభా : భక్తురాలికి యింతకంటే ప్రధానమయిన సాధనమేదీ లేదుగదండి!

అమ : (నవ్వుతూ) ఆత్మజనుల అంగీకారంకూడా అందుకు అవసరమేమో ఆలోచించావా? మరి?

ప్రభా : (సందేహముతో) అదిమీకా? నాకా?

అమ : (నవ్వుతూ) ఎవరికయినా గానీ!

ప్రభా : ప్రపంచం ప్రతికూలమయినా ప్రణయజీవుల పవిత్ర ప్రేమకుమాత్రం ప్రతిబంధకాలురావు.

అమ : (ప్రభావతిని కౌగిలించుకొని) ప్రభావతి! పరిశోధనాతీత మయిన నీ ప్రేమపాశం యెంతబలీయమయింది?

ప్రభా : కాదండిమరి?

అమ : (నవ్వుతూ చేయిపట్టుకొని) ప్రభావతి! శరీరాన్నుంచి ఆత్మను వేరుచేయగలనుగాని నా తరుణహృదయాన్ని గిలిగింతలుపెడుతూవున్న నీఆనందస్వరూపాన్ని మాత్రం నామనోపీఠమునుంచి వేరుచేయలేను. సుమా!

ప్రభా : సృష్టికి పెట్టనికోటలాంటి మీ జగన్మోహనమూర్తిని కలలోనయినా నామానసాకాశాన్నుంచి నేనుమాత్రం వేరుజేయగల నంటారా?

అమ : చిరునవ్వు ముత్యాలు చిలకరించు నీవు నా జీవితనౌకా యానానికి ధృవతారవయి జీవితభాగస్వామినివి కావడం నా పూర్వజన్మసుకృతం.

ప్రభా : చరిత్రాత్మక కర్తవ్య నిర్వహణకయి జన్మించిన మీ పాదపూజకు, నాయౌవన వనంలో పూసిన, ప్రణయ ప్రసూనాల్ని వుపయోగించి, మీప్రేమవాహినీ తరంగాల్లో వూగడంమాత్రం నా అదృష్టం కాదంటారా?

అమ : (ప్రభావతితో కలిసి ముందుకునడచి) చూడు! పలు రకాల పూలతో కనులపండువుగా కలకల్లాడుతూవున్న

మీా పూదోట నందనవనంలా, వసంతుని శోభావైభ
వాన్ని, వేనోళ్ళ చాటుతూ, యెంత మనోహరంగా
వుందో!

ప్రభా : అందుకనే గదండి! సహజసౌందర్యానికి కృత్రిమ
సౌందర్యం సాటికాకపోవడం?

అమ : ఎలాఅవుతుందిమరి?

ప్రభా : (ప్రేలితో చూపుతూ) చూడండి.........

తే॥ స్వనిలయాగతాతిథులని స్వాగతంబు
నొసగవనలక్ష్మి, మలయవాయువును, గంధ
మసెడు, నర్ఘ్యంబుతోఁబంచె, నాదరమున
స్వాగతము స్వీకరింపుడు, స్వాంతమలర.

అమ : (సుఖస్పర్శనభినయించి) అవును! ప్రభా! మీా ప్రమదా
వనలక్ష్మిగౌరవం అపూర్వంగావుంది.

ప్రభా : (ముందుకునడిచి) అమర్! యీా పూలమొక్కల్ని
నీరుపోసి నేనే స్వయంగా పెంచాను.

అమ : పెంచేవనే కాబోల్ను ఘుమఘుమా పరిమళించు పూల
తో యీా మొక్కలన్నీ నీరాకచూచి కృతజ్ఞతాసూచ
కంగా నిన్ను పలుకరించాలన్నట్లు తమ తలలొన్నల్లి
ఎట్లా యెత్తేయోచూడు.

ప్రభా : ప్రత్యుపకారబుద్ధితో చెట్లకు ఫలపుష్పాల్నియ్యడ
పరిపాటే గదండి!

అమ : ప్రభా! ఇటుచూడు! ఈ మల్లికా లత యౌవనాంగణంలో అడుగుపెట్టిన యువతీరత్నంలా తన చెంతనున్న పారిజాత పతిని అలుముకుని తనలా నీవుకూడా భర్తతో కలిసి వున్నావని నిన్ను యెంత ఆప్యాయంగాచూస్తూవుందో!

ప్రభా : (నవ్వుతూ) మన్మథాగమనంతో ప్రమానులకుకూడా...

అమ : ప్రణయానురాగం ప్రాదుర్భవించి మనుష్యుల్ని అను కరిస్తున్నాయంటావా?

ప్రభా : అవునండి !

అమర్ : (రెండడుగులు నడిచి) ప్రభా ! అటుచూడు ! కోకిల ఆ లేమావిమ్రాను కొమ్మపయి కూర్చుని లోకాన్ని మయిమరిపిస్తూ యెంత తియ్యగా పాడుతూ వుందో !

ప్రభా : అవునండి! మావి చివుళ్ళి మెక్కిన కోకిల తనమంజుల కూకూ స్వనంతో సర్వప్రాణుల్ని .........

అమర్ : ప్రాణుల్నేకాదు, స్థాణువుల్ని కూడా కదలిస్తూవుంది, (కొంచెం దూరం నడిచి) ఇటు చూడు! ఆ పూదీవె టుయ్యాలపయి కూర్చొని ఆగువ్వలజంట తమ ముక్కు ముక్కు కలిపిమూగ భాషతో గుసగుసలాడుతూ పరస్పరప్రేమాను రక్తితో యెంతవయ్యారంగా వూగు తూవుందో !

ప్రభా : (చూచి) అవునండి ! పరస్పరానురాగమే గదండి ? పతిపత్నుల ఇహాపర సుఖానుభూతికి పట్టిష్ఠమయిన పట్టుగొమ్మ !

అమర్ : కాదుమరి ? అందుకే ప్రియాప్రియులు ఐహికప్రేమ వాహినీ ప్రవాహాన్ని ఆధారం చేసుకుని ఆముష్మి కానంద పారావారపు టొడ్డును చేరగలుగుతారన్నారు?

ప్రభా : కాకపోతే ! ఆశ్రమ చతుష్టయంలో గృహస్థాశ్రమం గొప్పది ఎందుకు అవుతుంది ?

అమర్ : (వాచీ చూచుకొని) అబ్బా! అప్పుడే అయిదు కావచ్చిందే !

ప్రభా : (ఆశ్చర్యంగా) అప్పుడే !

అమర్ : అవును (ప్రేలితో కనపరస్తూ)

ఉ॥ అల్లదే ! కాంచుమా ! తరువులందు ఖగావళి గూండ్లలోనికిన్
మెల్లగఁ జొచ్చుచుండె, నటమేతకుఁ బోయిన గోగణంబులున్
సల్లలితంబుగాఁ దిరిగి స్వామిగృహంబులఁ జేరుచుండె, నో
పల్లవపాణిరో ! తమదువత్సములన్ పరికించు వేడ్కతో.

ప్రభా : అవును. సూర్యాస్తమయం అయ్యేసరికి, యే ప్రాణి గూటికి అది వెళ్ళిపోవాలి గదండీ !

అమర్ : ప్రభా! నీతోకలసి యీనవవిహారానంద మహాసాగ రంలో ఈదులాడుతూ యిక్కడే వుండిపోయేను.

ప్రభా : ఎప్పుడు మాయింటికి వచ్చినా, చెప్పుల్లో కాళ్ళుపెట్టు కునే వుంటారు !

అమర్ : కావలసినంత కార్యభారం నెత్తిమీద ఉండగా ఒక చోట కూర్చోవడం యెలా వీలవుతుంది ? చెప్పు ?

ప్రభా : మానాన్నగారితో మాట్లాడాలని కబురు చేసేరుగా ?

అమర్ : అవును. సమయానికి ఇంటిదగ్గర లేరుగా మీ నాన్న గారు!

ప్రభా : మీ జాబుచూచి యిప్పుడే వస్తానంటూ పొలం వెళ్ళారు. యీపాటికి బయలుదేరి వస్తూనే వుంటారు.

అమర్ : అన్నట్టు అసలు విషయాం మరచేపోయేను.

ప్రభా : ఏమిటండి ఆ మరచిపోయింది ?

అమర్ : ఈమధ్య నీవు సంగీతాన్ని కూడా సాదనచేసేవటగా ? ఒక పాటపాడితే......

ప్రభా : ఏం బహుమతి యిస్తారు ?

అమర్ : నీవు కోరిందే ఇస్తాను.

ప్రభా : సరే ! (పాడును)

"వీక్షే ! కదా ? దేవదేవం, గోపాలమూర్తిం ॥వీక్షే॥
సాక్షాన్మదనకోటి, సౌందర్యమూర్తి ॥వీక్షే॥
ప్రకటమృగమదతిలక, రమణీయఫాలం
సకలగుణ సంపత్తి, సహిత మురుఖేలం ॥వీక్షే॥
కాలమేఘ శరీర, కలిత విద్యుద్వసనం
కేళీకలాకుతుక, కించిత్కుంచి తాధరం ॥వీక్షే॥
తధిమి ధిమికి ధి మీంతి, తాండవవిలోలం
సిద్ధజన వినుత ప్ర, సిద్ధ తరశీలం ॥వీక్షే॥
సరసమురళీగీత, ర సామృతలహరీ
నిరతనారాయణ తీర్థ, నిర్మలమనోహంసం ॥వీక్షే॥"

అమర్ : (మహానందంతో) ఆహా ! వసంతకోయిలలా ప్రేమ రసాన్ని రేకెత్తించు నీ శ్రవణసుగాన మాధుర్యంతో నన్ను మయి మరపించావ్ ! ప్రభా !

చ॥ నిజతనుకాంతిచే శశిని నీవె, జయింతువు, గాన విద్యలో
సజునిసతిన్ హసింతు, వఖిలాగమ, తత్త్వ సుబోధనంబునన్
ద్విజవరుడా, వగిస్తునే, సతీమణి, హేళన చేతువింక వా
రిజదళ నేత్ర లెవ్వరు ? ధరిత్రి, సమానలు, నీకు నెచ్చెలీ !

ప్రభా : (సిగ్గుతో) అల్పజ్ఞురాలనగు నేనా ? ఆ మహాసాధ్వీ మణుల్ని అధిక్షేపించేది ?

అమర్ : అందుకు సందేహమా ? లలిత కళా విలాసినివి అగు నీ బహుముఖ ప్రజ్ఞావిశేషం సామాన్యమయిందికాదు.

ప్రభా : అభిమానంతో ఆడేమాటగాని నేనేమీ గొప్పదాన్ని కాదు.

అమర్ : (ధర్మయ్యగారి రాకచూచి) అరుగో మీనాన్నగారు వస్తున్నారు.

ప్రభా : నాన్నగారితో మాట్లాడి యీ సాయంత్రం మా యింట్లో భోజనంచేసి వెళ్ళాలి.

ధర్మ : (ప్రవేశించి) అవునుబాబు ! యీ వేళ మాపాపాయి అడిగినందుకయినా భోజనంచేయక తప్పదు.

అమర్ : క్షమించండి ! మరోసారి తప్పక చేస్తాలెండి. ఇంటికి వెళ్ళాలి.

ప్రభా : అదేం వీల్లేదు.

ధర్మ : అంత యింటికి వెళ్లాలంటే భోజనంచేసి వెళ్ళవచ్చుగా ? చిట్టీ ! శీఘ్రంగా వంటచేయించి పిలు వస్తాం.

ప్రభా : (సంతోషంగా) సరే ! నాన్నగారు ! (వెళ్ళును)

అమ : ఇంట్లోవాళ్ళి శ్రమపెట్టడానికి.........

ధర్మ : శ్రమేముందిబాబు! మాతోబాటునాల్గు మెతుకులేగా? నీకు పెట్టేది?

అమ : మామీద మీకుటుంబానికి ఆదినుంచి ఆదరాభిమానాలు ఉన్నవేగాని శ్రోత్రవికావు గదండి!

ధర్మ : పేదసాదలంటే ప్రేమతో కాపాడే మిమ్ము గ్రామంలో గౌరవించని వారెవరున్నారు?

అమ : అదిఅంతా మీబోటి పెద్దల ఆశీర్వాద ఫలితం? ధర్మయ్యగారు!

ధర్మ : అయితే! నిర్విఘ్నంగా మీభవనాల నిర్మాణంపూర్తి అయినట్టేగా?

అమ : ఆ! వెల్లతో సహితం నిన్నటికి భవనాలపనులన్నీ పూర్తి అయిపోయాయండి!

ధర్మ : ఈ యేకాదశికి గృహప్రవేశంకూడా.........

అమ : జరిపించాలనే వుందండి. కాని.........

ధర్మ : ముహూర్తం కుదరలేదా?

అమ : కుదరక కాదండి!

ధర్మ : మరి?

అమ : భవనాల కివ్వదలచినభూమి రిజిష్టరు చేయించిగాని...

ధర్మ : నీభూమి యేదో నీస్వాధీనంలో లేనప్పుడు యేభూమని రిజిష్టరు చేసియిస్తావ్?

అమ : అందుకు నాభూములేవో యీవారంలో కేటాయించు కోవాలనే గడండి చూస్తున్నాను

ధర్మ : ఆపని అంత తేలికగా అవుతుందనా? నీ విశ్వాసం?

అమ : నా ఆస్తిమీాదకూడా నాకుహక్కు లేకపోతుందంటారా?

ధర్మ : లేకపోతుందనికాదు బాబు. నీవంతతొందరపడితే మీా మామగారితో నీకు అభిప్రాయభేదాలేర్పడి, అవి అంతర్యుద్ధానికి దారితీస్తాయని నాభయం.

అమ : అందుకని నా అస్తిత్వాన్ని కోల్పోయి బసవన్నలా వారాడించినట్టు ఆడమంటారా?

ధర్మ : సరిఅయిన బాటనుపోయి కార్యాన్ని సాధించుకోవడమే మనకర్తవ్యం

అమ : పారమార్థికదృష్టిలేని భౌతికవాదులు న్యాయానికి కట్టు బడతారని నమ్మకమేముందండి! ధర్మయ్యగారు!

ధర్మ: ఆదాయవ్యయాల జమాఖర్చుల్లో ఏమయినా అన్యాయం చేస్తారేమోగాని నీ అరవై యెకరాలభూమి నీది కాదన లేరుగా?

అమ : "గుడినిమ్రింగేవానికి లింగం అడ్డంవస్తుం"దంటారా?

ధర్మ : దారుణకృత్యానికి తలపడి దస్తావేజులు దాచుకలుగు తారుగాని తాలూకాఫీసులోని రికార్డు తగల బెట్ట లేరుగా?

అమ : ఈ యేటినుంచి మామామగారు తొలగించిన మా పూర్వపురైతులకు మానాన్నగారిచ్చినట్టు మా భూ ముల్ని సగంపాలుకే యివ్వడానికికూడా నిర్ణయించు కున్నాను.

భాస్క : (ప్రవేశించి) "ఆలీలేదు చూలీలేదు కొడుకుపేరు సోమలింగం" అన్నట్టు మీవ్యవహారం అటోయిటో తేలకుండా నీమాట యెలాసాగుతుంది?

అమ : సామోపాయంతో నా వ్యవహారం చక్కబడకపోతే...

ధర్మ : దండోపాయానికి తలపడతావా?

అమ : రెక్కాడితేనేగాని డొక్కాడని యీనాటి బీదరైతుల్ని పీల్చి పిప్పిచేస్తూ నేటి సమాజవాదయుగంలోకూడా భాగ్యవంతులమన్న మాబోటివారికి శాంతిగా బ్రతకడం సాధ్యపడదు ధర్మయ్యగారు!

ధర్మ : కాదని కలహానికి కాలుద్రువ్వితే కలిసివచ్చేదేమీ వుండదు.

భాస్క : "వేసిన బెడ్డకెల్లావ్రూరుకుంటూఉంటే వెఱ్ఱోడేగెలిచే' డని జడిసే కొలదీ యింకాజడిపిస్తారు.

అమ : ధర్మయ్యగారూ! మరోమాట.

ధర్మ : ఏమిటిబాబు అది.

అమ : గణపతిగారు మొన్న ప్లీడరుగారియింటివద్ద యేదో గంద్ర గోళం చేసేరటగా? నిజమేనండి?

ధర్మ : అది చివరికి నీ చెవిలోకూడా పడిందన్నమాట.

భాస్క : "పిల్లి కళ్ళుమూసుకుని పాలుత్రాగుతూ తననెవరూ చూడరనుకుంటే చూడకపోతారా?

అమ : ప్లీడరుగారుకూడా పేచీకి దిగమనే సలహాయిచ్చేరా? ధర్మయ్యగారూ?

భాస్క : పేచీపెట్టుకోమనకపోతే ఫీజులిచ్చే పెద్దమనుష్యులు ఎవరుంటారు? ఈ ప్లీడర్లకి?

అమ : న్యాయవాదివృత్తి నేతిబీరకాయులాంటి దన్నా రందుకేగా?

భాస్క : కాకపోతే! యీరోజుల్లో ధనం సంపాదించాలంటే! పేచీల్ని పెంచే ప్లీడరో, ఖాదీగుడ్డలుకట్టే లీడరో, సినీ మాకు సూటయ్యేయాక్టరో, నూదులెక్కించే డాక్టరో అయివుండాలని యెందుకంటారు?

అమ : (నవ్వి) అవునవును. లేకపోతే! యీ విజ్ఞానయుగంలో కూడా న్యాయంపేరిట అన్యాయాలు ఎందుకు అధిక మయిపోతాయి! చెప్పు?

ధర్మ : అన్యాయమో! న్యాయమో! మనంకూడా కళ్ళకు గ్రుచ్చుకుంటుందన్న పుల్లను, కనిపెట్టి తప్పించుకోవాలిగా?

అమర్ : తప్పించుకోవడానికి తటస్థ విధానమే ప్రస్తుతం తరుణోపాయ మంటారా ? ధర్మయ్యగారు !

ధర్మ : ఈవేళో, రేపో, పిలుచూచుకుని మీ మామగారితో మాట్లాడి, నీకేవిషయం చెప్పేవరకు, నీవెవరితోటి మాట పట్టింపు పెట్టుకోవద్దు.

భాస్క : కొంపంటుకున్నాక, కోనేరు త్రవ్వి ప్రయోజనమేముంది ? నాన్నగారు !

ధర్మ : లేకపోతే లేనిపోని పేచీపెట్టుకుని గోటితోచిదిమితే పోయేదానికి గొడ్డల్నుపయోగిస్తారా ?

భాస్క : చిన్నపామునైనా పెద్దకఱ్ఱతో కొట్టాలన్న సామ్యం వూరికే వచ్చిందంటారా ?

ధర్మ : ఏమయినా పరుగెత్తి పాలుత్రాగేకంటే ! నెమ్మదిగా పోయి నీళ్లుత్రాగడం మంచిది బాబు !

అమర్ : సరే ! మీమాటకాదనడం యెందుకు ? మీ రాయబారంతో, మామామగారు దారికి రాకపోతే మాప్రయత్నం మాకుంది గదండి.

ధర్మ : దానికేం ? తరువాత మీ ప్రయత్నమేదో మీరు చేసుకోవచ్చు. బాబు !

భాస్క : మీ మామగారితో వ్యవహారం, మంత్రాలికి చింత కాయలు రాల్తాయనా ?

ధర్మ : అదేంమాట ? అణ్వస్త్రానికి సాధ్యంకాని కార్యం మన గాంధీమహాత్ముని అహింసాయుధానికి సాధ్యంకాలే దంటావా ?

ప్రభా : (ప్రవేశించి) భోజనానికి లేస్తారా ? నాన్నగారూ!

ధర్మ : సరే! వడ్డించు వస్తున్నాం, లేబాబు! తరువాత మాట్లాడు కొందాం.

(అందరు నిష్క్రమింతురు)

(తెర పడును)

శ్రీః

# కన్యకూతురు

## [సప్తమదృశ్యం]

(శ్రీహరిరావుగారి యింటిచావిడి. డాక్టరు కొన్ని కుర్చీలు వుండును. శ్రీహరిరావుగారు గణపతితో మాట్లాడుతూ వుండును.)

శ్రీహరి : దానికేంకాదు, నేననేది! ఇంతవరకు మనల్ని, వ్రేలు పెట్టి కనపర్చి విమర్శించిన వాడెవడయినా వున్నాడా? అని గానీ!

గణ : అవునండి. పదేండ్లనుంచి లేని పరివర్తనం మనగ్రామస్థులలో యేర్పడిందంటే! యీ యువజన సంఘంవల్ల కాకపోతే! యింకేమని చెప్పుకోవాలి? మనం?

శ్రీహ : రాత్రికూడా! యెక్కడో! వీళ్ల సమావేశం జరిగిందటగా?

గణ : ఎక్కడో కాదండి! ఎదురొమ్ముమీద కుంపటిలా మావీధిలోనే జరిగింది.

శ్రీహ : ఇంకేం! సభాధ్యక్షు డెవరేమిటి?

గణ : ఎవరో అయితే! విచారించవలసిం దేముందండి! మన వాడే?

శ్రీహ : మన అమర్‌నాథేనా?

గణ : అవునండి.

శ్రీహ : "చెవిటివాని ముందు శంఖం వూదినట్టు" మొన్న నేను చేసిన వుపదేశం వ్యర్థమయి పోయిందన్నమాట !

గణ : వ్యర్థంకాక సార్థ ం యెలా అవుతుందండి?

శ్రీహ : సమావేశంలో చర్చించిన విషయాలుకూడా విన్నావా?

గణ : వినకపోవడం యేమిటండి! మా అరుగుమీద కూర్చొని విషయాలన్నీ ఆలకించాను.

శ్రీహ : ఏమిటా విషయాలు ?

గణ : "పదవీ వ్యామోహాపరులు పదవుల్లో వున్నంతకాలం ప్రజలపాట్లు భగవంతుడుకూడా తీర్చలే" డని అధికారాన్ని దుర్వినియోగంచేసే వాళ్ళి పదవీభ్రష్టుల్ని చేయడమే మన ప్రథమకర్తవ్యమని మీ మేనల్లుడు ఉపన్యాసం చెబుతూవుంటే నా చెవులు గింగురుమని తల గిర్రున తిరిగిపోయిం దనుకోండి.

శ్రీహ : (తల నాడించి) "కడుపు కోసుకుంటే కాళ్ళమీద పడుతుం" దని వీడిగురించి యెంత ఓర్పు వహించినా వీడుమాత్రం నన్ను వీధిపెట్టడం మాన లేదు.

గణ : వీధిపెట్టడమే కాదు. యీ పంచాయతీ యెన్నికల్లో మీ బ్రతుకునంతా బయటపెట్టి పరాభవంచేసి తీరతా డట కూడాను.

శ్రీహ : (కోపంతో) పెంచి పెద్దవాణ్ని చేసి విద్యాబుద్ధులు చెప్పించినందుకు వీడి వివేకం యీ విధంగా పరిణమించి వక్రగమనానికి వుపక్రమించిం దన్నమాట!

గణ : కీలెరిగి వాతపెట్టకపోతే! యెంత తెలివిగల వారయినా తెల్ల మొగం వేయక తప్పుతుందా? రావుగారు!

శ్రీహ : తప్పదని కాళ్ళుచాచుకుని కూర్చుందామా?

గణ : అందుకు "అర్థస్యపురుషోదాసః" అనే పూర్వసూక్తిని పురస్కరించుకుని యీ సారి మనం అర్థబలంమీద ఆధారపడికూడా లాభంలేదు.

శ్రీహ : లాభంలేక మాటల్లో మనకి ఓట్లిచ్చే మహనీయు లెవరూ? మనవూళ్ళో?

గణ : ఈసారికూడా డబ్బుతీసుకున్నవాళ్ళంతా ఓట్లిస్తారనేగా? మీవూహ?

శ్రీహ : దగాచేస్తారంటావా?

గణ : తప్పకుండాను. ప్రత్యామ్నాయపు పార్టీమీద ఉన్న మోజు గ్రామస్థులికి యీనాడు మనమీదలేదు. రావు గారు!

శ్రీహ : లేనప్పుడు. మనం ఈ పట్టుకు పోటీచేయడం మానడమే మర్యాదేమో!

గణ : అదేంమాటండి! పిరికిమాట ఆడతారు!

శ్రీహ : కాదని మనం చేసేదేమిటంటావ్?

గణ : లేకేమండి! మీమేనల్లుణ్ణి నయాన్నో భయాన్నో యీ యెన్నికలయ్యేవరకు వీధికెక్కకుండాచేసి, మీ అదుపులోనే వుంచగలిగేరంటే!

శ్రీహ : ఉంచగలిగితేగానీ మనపాచికలు పారవంటావా?

గణ : పరవ్!

శ్రీహ : అయితే! యిప్పుడే యీవిషయం తేల్చుకుందాం?

గణ : తేల్చుకోకుండా కార్యరంగంలో కాలుపెట్టేమా?

శ్రీహ : ఓటమితప్పదంటావు?

గణ : ఓటమి తప్పకపోవడం ఒక్కటేకాదు "గుడ్డికంటికి మందువేస్తే ఉన్నకన్ను ఊడిందని" పదిహేనేండ్లనుంచి నిరాటంకంగా నిర్వహిస్తూవున్న మనదేవాలయ ధర్మకర్తృత్వానికికూడా తిలోదకాలిచ్చుకోక తప్పదు.

శ్రీహ : అదీనిజమే! విషయం విషమించేక విశ్వప్రయత్నం చేసినా మనప్రయత్నం ఫలప్రదంకాదు. గదిలో వున్నాడేమో! నే రమ్మన్నానని పిలు.

గణ : సరేనండి (వెళ్ళును)

శ్రీహ : (తనలో) "ఆకుమూసాలు స్నేహంచేస్తే వారే వీరవుతా"రను సామ్యంగా భాస్కరరావు స్నేహంచేసి బంగారంలాంటి వీడు పనికిమాలినవాడయి పోయేడు. గణపతి చెప్పినట్టు ముందు వీనిముందరికాళ్ళకి బందాలు వేయకపోతే, ఈ వ్యవహారంలో వెఱ్ఱిమొగంవేసి వెళ్ళ

గిల్లుకుంటూ యింట్లో కూర్చోడం తప్ప తలయెత్తుకుని వీధిలో తిరగడం నాతరం కాదు.

గణ : (ప్రవేశించి) "మొక్కగా వున్నప్పుడు వంగంది మ్రానయ్యాక వంగుతుందా.

శ్రీహ : రానన్నాడా గణపతి!

గణ : రానంటే యింకేమండి!

శ్రీహ : ఏమన్నాడు మరి?

గణ : ఏమంటే! మాత్రం మీరిప్పుడేం చేయగలరు?

శ్రీహ : (కోపంతో) చేయలేక వానిముందు చేతులు కట్టుకు నిలుచుంటా ననుకున్నావా? ఇంత బ్రతుకూ బ్రతికి?

గణ : ఎంత బ్రతుకు బ్రతికి మీరు ఎంత విలువ సంపాదిస్తే మాత్రం అమరనాథుని దృష్టికి ఆవగింజలా కనిపిస్తున్నారు.

శ్రీహ : కనబడతాను! ఎందుకు కనబడను!

గణ : బ్యాంకులోని లక్షరూపాయలు తెచ్చి భవనాలు కట్టిస్తే మీరేం చేయగలిగేరు? దాయమని యిచ్చిన పదివేల రూపాయలు దానధర్మాలు చేసేస్తే మీరేం అనగలిగేరు? అసేగా వానిగుండె ధైర్యం?

శ్రీహ : తలిదండ్రులు లేనివాడు గదా! పాపం! అని దయతలచి వూరుకుంటున్నందుకు నానాటికి వీనిపోకిరీతనం పెచ్చు పెరిగిపోతూవుంది.

గణ : ఇంతవరకు వీసిగురించి యెంత వేమరుపాటుగావుంటూ వున్నా యేదోనడిచిపోయింది. ఇంక జాగరూకులయి వుండకపోతే మనయిద్దరి పసువుల్ని బయటపెట్టి పరాభవంచేయక మానడు మీామేనల్లుడు.

శ్రీహ : వీడుచేసే దేమిటో యింక నేనూ చూస్తాగా? నానా గడ్డి కరచి ఆర్జించి ఆవాలముద్దగాచేసిన ఆస్తిని తన పరంచేస్తాననుకుంటున్నాడేమో! గిల్లుకున్నా చిల్లికాని వానిచేతిలో పెట్టను.

గణ : పెట్టననడంతో బెదిరిపోయి మీామాట వినడు. యీనాటినుంచి చేసి కనపరస్తూవుంటే మీా చెప్పచేతల్లో తప్పక వుంటాడు.

శ్రీహ : ఉండేటట్టుచేస్తాగా? సరే! ఈ విషయం ఇలావుంచు. నీవు ధర్మయ్యగారి యింటికి వెళ్లినవని యేంచేసుకొని వచ్చావ్!

గణ : ఆహారనిద్రలనకుండా యెక్కేగుమ్మంయెక్కి దిగేగుమ్మం దిగి యెన్ని బాధలు పడుతూవున్నానంటారు? మీావివాహంగురించి?

శ్రీహ : ఎన్ని బాధలుపడి ఏంలాభం? అదిగో! ఇదిగో! అంటూనే నాస్నాటికని వెళ్ళిపోయేక కూడా, యేడేళ్ళుగడిపేశేవ్! ఈ నెలదాటితే ముహూర్తాలు యీా సంవత్సరానికి లేవనికూడా నీవే అన్నావు కూడాను.

గిరీ : లేనిమాట నిజమేనండి మరి? మనలో మనమాట అర వయివేళ్లు దాటినవారికి అంతసులువుగా పిల్లనీయడానికి అందరు అంగీకరిస్తారా? చెప్పండి.

శ్రీహ : అందుకనే? ధర్మయ్యగారు ఊఁ అంటే! వారు ఈయ వలసిన ఇరువదివేలరూపాయలనోటు జమకట్టి యిస్తామని చెప్పమన్నాగా?

గిరీ : నోటుఒకటేకాదు రొఖ్ఖంకూడా కొంత ఇస్తామని చెప్పి ధర్మయ్యగారిని తథాస్తనిపించేసరికి నా తలప్రాణం తోకకు వచ్చిందనుకోండి.

శ్రీహ : రొఖ్ఖంకూడా పెట్టేవ్వా? సరే! వారు ఆమోదించేక అభ్యంతరం......

గిరీ : లేకపోవడమేమిటి? అరవై కాసులబంగారం యిస్తామని అంటేగాని పెళ్ళికూతురు, పేచీపెట్టడంమాని అన్న ముఖంచూచి ముసిముసినవ్వు నవ్వలేదు కూడాను.

శ్రీహ : నవ్వుకుని చివరికి సరే! అందా ?

గిరీ : సగం బంగారం ముందు పంపించి నీయిష్టం వచ్చిన నగలు చేయించుకోమని కబురుచేసేమంటే! కళ్ళగ్గిరుని తిరిగిపోయి కాదన లేదులెండి!

శ్రీహ : (సందేహాముగా) కాదంటే !

గిరీ : కాదంటే! మన బంగారం మనకు ధర్మయ్యగారు తక్షణం పంపివేస్తారు !

శ్రీహరి : భాస్కరరావు ప్రతిబంధకం యేమీ వుండదుగదా ?

గణ : భాస్కరరావు ఇష్టాయిష్టాలతో పనేముంటుందని మీ భయం ?

శ్రీహ : చెడగొట్టడానికి చేటపెయ్యిచాలు. కాల్చడానికి కాలాగ్ని కావాలా ?

గణ : ఆపైన నేనున్నా గదండి !

అమర్ : (ప్రవేశించి) ఏమండి ! మామాజి ! నన్ను పిలిచేరట?

శ్రీహ : (చూచి) అవును ! నీతో మాట్లాడాలని పిలిచేను.

అమర్ : ఇక్కడే మాట్లాడతారా ?

శ్రీహ : రహస్యం యేమీకాదు.

అమర్ : సరే ! చెప్పండి.

శ్రీహ : ఏముంది ? ఈపట్టుకు నీవు మన పంచాయతీ యెన్నికల్లో నన్ను బలపరచాలి.

అమర్ : అదినావల్ల నయ్యే పనికాదండి.

శ్రీహ : ఎందుకని ?

అమర్ : ఇష్టంలేక ?

శ్రీహ : నేను పంచాయతీ బోర్డుకి ప్రశిడెంటు నవడం నీకిష్టం లేదా ?

అమర్ : లేదని చెప్పేం గదండి !

శ్రీహ : పోని ! నీవు పోటీచేయి, నేను నిన్ను బలపరుస్తాను. సరేనా ?

అమర్ : దేశకళ్యాణ సృష్టితప్ప అధికార వ్యామోహం నాకు ఏమాత్రంలేదు. అది మీకు తెలియదేమో !

శ్రీహ : 'అమ్మ పెట్టనూ పెట్టదు. అడుక్కుని తినానీయదూ' అని నీవ్యవహారం యేమీ బాగాలేదు.

అమర్ : దేవాలయధర్మకర్తలై దేవుని సొమ్ములు తినేమీరూ కపటోపాయ ధురీణులయిన మీ గణపతిగారు కలిసి ప్రజలసొమ్ముల్ని కూడా పంచుకోవడానికేగాని, ప్రజా సౌకర్యాలు చేయాలనే పవిత్రాశయాలతో కాదు గదండి ! మీరీ పంచాయతీబోర్డు ప్రశిడెంటు పదవికి పోటీచేయడం ?

శ్రీహ : (కోపంతో) "చేతరేణువంతమాట మేరువంత" అని ఏమిట్రా ప్రేలుతున్నావ్.

గణ : "నేలకుపోయేది నెత్తికి పులుముకుంటూ" వెందుకు చిన బాబు !

అమర్ : నీలా నేనేమీ మేకవన్నె పులినికాను. గణపతి ! ముఖస్తుతి చేయడానికి !

శ్రీహ : నీవు మహాదేశోద్ధారకుడవు కాబోల్నే ?

అమర్ : దేశోద్ధారకుడనని చెబుతూ మీలా నేనేమీ పగటి-వేషాలు వేయడంలేదు.

గణ : పెద్దా పిన్నా అనే తారతమ్యం లేకుండా మాట్లాడ్డం మంచిది కాదు సుమా !

అమర్ : (హేళనగా) పెద్దలు! ఎందుకు పనికివచ్చే పెద్దలు మీరు? డబ్బు సంపాదించాలనే పెద్దజబ్బుతో న్యాయా న్యాయాల్ని పాపపుణ్యాల్ని పాటించకుండా ప్రవర్తించే మీరేనా ? పెద్దలు!!! (వికటంగా నవ్వి) ఎవరు పెద్దలో, ఎవరు పిన్నలో, యెవరికి వారు ఆత్మావలోకనం చేసు కుంటే అర్థమవుతుంది ?

శ్రీహ : (కోపంతో) "గుడ్డువచ్చి పిల్లని వెక్కిరించిం ద"ని నీవా ? మాకు బుద్ధిచెప్పేది ?

గణ : అతిగుంభనగా నడిచిపోతూవున్న సంసారాన్ని నలుగురి నోళ్ళో పడవేయడం నీకే నష్టం సుమా ! చినబాబు !

అమర్ : నష్టం వచ్చినా ! కష్టం వచ్చినా ! సత్యధర్మాలు తోడునీడలుగాగల నేను మీలా న్యాయదూర మయిన నడత గలవాణ్ణికాను.

శ్రీహ : (కోపంతో) న్యాయం లేకుండా నడిచేది మేమే అంటావా ?

అమర్ : కాదని గుండెమీద చేయివేసుకుని చెప్పండి.

శ్రీహ : (కోపంతో) ఏమిటి మేంచేసే అన్యాయం ?

అమర్ : "ముంజేతి కంకణానికి అద్దం కావాలం"టారా ?

శ్రీహ : (కోపంతో) చెలపాముతో చెల్లాటం చేటుకాలానికని తెలుసుకోవాలి.

అమర్ : తెలుసు ! పాముపడగ నీడను పడుకోవడం ప్రమాదం అని నాకు బాగా తెలుసు మామాజి !

గణ : తెలుసుండికూడా ! ఆ రొమ్ము విరచుకుని మీదకువస్తున్నా వన్నమాట.

అమర్ : సామరస్యంగా కార్య సాఫల్యం కానప్పుడు సంగ్రామం కంటే శరణ్యం యేముంది ? మరి ?

శ్రీహ : పరిస్థితులు ప్రతికూలమయ్యేక పశ్చాత్తాపపడి ప్రయోజనం లేదు యేమనుకున్నావో !

అమర్ : ఏమనుకుంటాను ! ఒకరినొకరు బెదరించే రోజులు ఒకరికొకరు బెదిరేరోజులు పోయేయని మీకు యిప్పుడయినా తెలుసుకోవడం చాలా మంచిదనుకుంటాను.

గణ : అంతేగాని యువజన సంఘం ప్రశిడెంటు పదవికి రాజీనామా దాఖలు చేయునంటావా ? చినబాబు !

అమర్ : ఆత్మస్వాతంత్ర్యాన్ని హాతం చేసుకుని మీ అడుగులకి మడుగులొత్తే అధముణ్ని కాను గణపతి !

శ్రీహ : మీ ఆస్తిలో ఒక గ్రుడ్డిగవ్వకూడా నీచేతికి చిక్కనివ్వను. జాగ్రత్త !

అమర్ : చిక్కనివ్వక మీ ఆస్తితోబాటు మా ఆస్తినికూడా నెత్తిని కట్టుకుని చనిపోయేటప్పుడు పట్టుకుని మరీ వెళ్ళండి నా అభ్యంతరం వుండదు.

గణ : వెనుక ముందులు విచారించకుండా మాట్లాడుతున్నావ్ !

అమర్ : "తాటాకు చప్పుళ్ళకు కుందేలు బెదరదు. వెళ్ళవయ్యా ! చెప్పేవ్ ! ఇందుకేనా మీకు పిలిచింది.

శ్రీహ : ఇదిగో! ఇంకొకసారి చెబుతున్నా విను. ఈనాటినుంచి ఎన్నికలయ్యే వరకు వీధిగుమ్మం దాటేవంటే దేవిడీ మన్నా చేయించి కాళ్ళు పట్టుకుని కరుణించమన్నా కన్నెత్తి చూడను.

అమర్ : (నిర్భయంగా) ఆస్థితి చివరకు మీకే వస్తుందేమో! దీర్ఘంగా యోచించి మాట్లాడండి మామాజీ! (వెళ్ళబోవును)

శ్రీహ : (క్రోధావేశంతో) ఆగు! ఏమిట్రా ప్రేలేవ్! (పన్నగఱ్ఱతో బుఱ్ఱమీద గట్టిగా కొట్టును.)

అమర్ : (దెబ్బతో గబాలున పడిపోవును)

గణ : (కంగారుపడి అమర్నాథుని వద్దకు వెళ్ళి రక్తం చూచి) అయ్యో! అయ్యో! ఎంత రక్తమండోయ్!

అమర్ : (గిలగిలా కొట్టుకొనును)

శ్రీహ : (భయంతో) గణపతి! తలపులన్నీ వేసేసి వెంటనే మన డాక్టర్ని తీసికునిరా! వెళ్లు. వెళ్లు.

గణ : (కంగారుగా) కొంప కొల్లేరులో ముంచేశేరు. నేను డాక్టర్ని తీసుకుని వచ్చేవరకు ఇక్కడే ఉండండి. (తలుపులు వేసి వెళ్ళిపోవును.)

శ్రీహ : (భయకంపితుడై ఇటూనటూ తిరుగును.)

(తెర పడును)

శ్రీః

# కన్నకూతురు

## [అష్టమ దృశ్యం]

(ధర్మయ్యగారి యిల్లు ప్రభావతిగది ప్రభావతి ఆనందంగా పాడుకుంటూ ప్రవేశించి కుర్చీలో కూర్చొనును.)

చ॥ అసమవిలోచనైక జనితానలపాత విదగ్ధమూర్తియై
కుసుమశరుండు లోకమునకుం గనుపింపకయుంటచేతనే
యసదృశరూపవంతు నపరాంగజు బ్రహ్మసృజించె లేకయీ
మిసిమిసలాడు బంగరపు మేనిగలాడు ధరిత్రిఁ బుట్టునే ?

గోడకు తగిలించిన అమర్‌నాథ్ ఫోటో క్రిందపడి వుండుట చూచి వ్యాకులపాటుతో గభాలున లేచి ఫోటో తీసి)

"హేతువు లేక తీతువు కూయ"దనే సామ్యంగా మాకు ఏదో అనర్థం లేకపోతే! యీఫోటో క్రింద యెందుకు పడాలి? శరీరాలు రెండయినా ఆత్మమాత్రం ఒకటే అనుకును మా ప్రేమ పాశానికి భంగం కలుఁగదుగదా!...కలుగదు. నా ఆత్మఫలక చిత్రితులయిన నా అమర్‌నాథుని హరించి వేరుచేయడానికి యెవరికీ శక్తిలేదు. (దీర్ఘంగా నిట్టూర్పు విడిచి, చితికిన అద్దపుపెంకులను దూరంగా

గిరటవైచి. ఫోటోను డ్రాయరులో పెట్టి తన కుల
దేవత యెదుట నిలబడి.)

శ్లో॥ కాత్యాయణి! నమస్తుభ్య, మార్తావన పరాయణి!
పాహిమాం కరుణాశీతే! శరణాగత వత్సలే!

(అని ప్రార్థించి వచ్చి కుర్చీలో కూర్చుండును)

ధర్మ : (ప్రవేశించి) ఏం ? పాపాయ్! పరధ్యాన్నముగా
కూర్చొని యేఁమిటలా ఆలోచిస్తున్నావ్ ?

ప్రభా : (ఉలికివడిలేచి) ఏంలేదు నాన్నగారు ఎక్కడికో వెళు
తున్నానని బయలుదేరి వెళ్ళలేదేమండి?

ధర్మ : వెళదామని వీధిలోకి వెళ్ళేసరికి గణపతిగారు బంగారం
పంపించి నన్నురావద్దని కబురు చేసేరు.

ప్రభా : (ఆశ్చర్యంగా) ఎవరికి నాన్నగారు ఆ బంగారం ?

ధర్మ : ఎవరి కేమిటి ? నీకే ?

ప్రభా : నాకా ? ఎందుకు పంపేరు ?

ధర్మ : ముందుగా సగం బంగారం పంపమంటే పంపేరు.

ప్రభా : ఎవరు పంపమన్నారు? ఏమిటీ కుతంత్రం నాన్నగారు!

ధర్మ : కుతంత్రం యేముంది ? మన మీాయవలసిన ఇరువది
[illegible] రూపాయల నోటు జమకట్టి యిచ్చి అరువది
కాసుల బంగారం యిస్తే శ్రీహరిరావుగారిని పెండ్లి చేసు
కుంటానన్నావటగా ?

ప్రభా : ఆమాట నేను అనలేదండి.

ధర్మ : మరి ! ఏమన్నావ్ !

ప్రభా : నేనూ అన్నయ్యా చదరంగం ఆడుకుంటూ వుండగా, గణపతిగారు వచ్చి పిచ్చి పిచ్చిగా ఏదో వాగుతూ వుంటే ...

ధర్మ : సరే ! అన్నావ్ !

ప్రభా : అబ్బే ! నేనేమీ అనలేదు నాన్నగారు !

ధర్మ : ఇంకెవ రన్నారు ? నీవుగాక ?

ప్రభా : విడిచిపెట్టకుండా వేధించుకుని తింటూవుంటే ! సరే ! "వెళ్ళు మా నాన్నగారితో, మాట్లాడి కబురుచేస్తాం" అని అన్నయ్య అన్నాడు,

ధర్మ : పెండ్లాడేదానవు నీవయితే, అన్నయ్య "సరే !" అనడంలో అర్థమేముంది ?

ప్రభా : పరిహాసంగా అన్నయ్య అన్న మాటను యదార్థమనుకోవడం అర్థముందటారా?

ధర్మ : ఇంతకు నీవనేదేమిటి ?

ప్రభా : వారి బంగారం వారికి పంపివేయమంటాను.

ధర్మ : అవును, కాదని, పెద్దవాళ్ళతో పేచీపెట్టుకో మంటావా?

ప్రభా : పేచీపెట్టు కోపలసినంత ప్రమాదం యేం వచ్చిందంటారు ?

ధర్మ : మీరిద్దరు సరే ! అంటే ! వాళ్ళయిష్టమే నాయిష్టం అని నేను కూడా సరే ! అని సమ్మతించేను.

ప్రభా : ఈడు జోడు కాని వివాహం చేయడానికి బాధ్యత తీరి పోతుందనే భావంతో యిష్టపడ్డారా? నాన్నగారు !

ధర్మ : నేనయినాపదిరాళ్ళు వున్నవానిని పెండ్లాడి, బ్రతికినంత కాలంహాయిగా సుఖం అనుభవిస్తావని ఇష్టపడ్డాగాని ధన వంతుడు అల్లుడయి త్రవ్వి నా తలకెత్తుతాడనే తలంపుతో కాదు.

ప్రభా : అయితే ! అమర్‌నాథుని కిచ్చి పెండ్లి చేయడానికి మీకు అభ్యంతరం ఏం వస్తుంది ? నాన్నగారు !

ధర్మ : కట్నాలిచ్చి నీవు కావాలన్న వాణ్ని పెండ్లి చేయ మంటావా ?

ప్రభా : కట్నం కావాలని అమర్‌నాథ్ మిమ్ము అడిగేరా ?

ధర్మ : కట్నం కోరకపోతే మాత్రం కళ్లారాచూస్తూ యేమీ లేని వానికి వివాహం చేయడానికి యెలా ఇష్టపడతాను?

ప్రభా : అమర్‌నాథ్‌కి పిత్రార్జితమైన ఆస్తి అరవై యెకరాలు శ్రీహరిరావుగారు అపహరించాలని ఆలోచిస్తున్నారా?

ధర్మ : ఆలోచించే దేముంది ? పన్నెండేండ్లు శ్రీహరిరావుగారి భుక్తంలో వున్న భూములు క్రొత్త చట్టం ప్రకారం హైకోర్టు కెక్కినా అమర్‌నాథ్‌కి రావని పెద్దపెద్ద ప్లీడర్లు బల్ల గ్రుద్ది చెప్పేరట. విన్నావో లేదో !

ప్రభా : అలా చెప్పకపోతే! ప్లీడర్లికి ఫీజువిచ్చే పెద్దన్నయ్య లెవరుంటారు?

ధర్మ : ఎవరేమన్నా చెప్పులేగాని. కంప్లులేని న్యాయస్థానంలో విత్తంలేని వారిమాటకు విలువుండదు. పాపాయి!

ప్రభా : విలువున్నా లేకపోయినా అమర్‌నాథునికి మాత్రం కోర్టులకెక్కే ఆశయం యేకోశాన్నా లేదు.

ధర్మ : అందుకే! నిన్ను వానికివ్వడానికి నేనూ అనుమతించక పోవడం

ప్రభా : అనుమతించక పోవడానికి! భాగ్యంలేకపోతే మాత్రం అమర్‌నాథ్ భార్యను పోషించు కోలేరా?

ధర్మ : ఇనుపగజ్జెల తల్లికి యిల్లరికపుటల్లుడయి కూర్చున్న వాడిని వివాహమాడి యిబ్బంది పడుతూవుంటే! కన్న వారికి కలిగే కడుపుకోత అనుభవంలేని వారికేం అర్థ మవుతుంది?

ప్రభా : విజ్ఞానానికి విదేశం వెళ్ళినా? కూటికి గుడ్డకి కొదువ రాదు. నాన్నగారు!

ధర్మ : (ఆవేశంగా) విజ్ఞాని అయితే మాత్రం విత్తంలేనివాణ్ణి పెండ్లాడి వానితో కలిసి జోలికట్టుకుని, అడుక్కు తింటావా?

ప్రభా : (ఆవేశంగా) అనుకూలుడయిన భర్తతో కలిసి అడు

కుక్కని తింటూ యేకుటీరంలో నైనా బ్రహ్మానందంగా బ్రతుకవచ్చు. నాన్నగారు!

ధర్మ : భవిష్యత్తులో నీ జీవితం అంధకార మయమవుతుందని భావించి మాట్లాడంలేదు. పాపాయి!

ప్రభా : ఎవరికర్మకు ఎవరుకర్తలు? నాన్నగారు!

సీ॥ సచరాచ రాత్మక జగముల సృజియించు
లోకేశునకుఁ గొంప లేకపోయె
బ్రహ్మాండజాలైక పరిపాలకుండైన
శౌరిభుజంగమ శాయియయ్యె
అష్టసంపద్యుక్తుఁడగు నష్టమూర్తికిఁ
దిరుపంబునెత్తక దీరదాయె
సర్వలోకానంద సంధాయకుండైన
మారదేవుండ శరీరుడాయె

తే॥ అట్టిలోకోప కారకులైన బ్రహ్మ
విష్ణు శంకరస్మరులకే వెతలు గుడుపఁ
దప్పలేదన నెవరికినిఁ దప్పుచుండు?
మానవాళికి నేరీతి మహితలమున.

ధర్మ : అందుకని తెలిసికూడా కష్టాల్ని ఆహ్వానించి కడగండ్ల పాలవుతావా?

ప్రభా : వద్దనుకుంటే వచ్చేకష్టాలురాక రద్దవుతాయంటారా?

ధర్మ : (కోపంగా) నీమెట్టవేదాంతం కట్టిపెట్టి, నేచెప్పినమాట వింటావా లేదా?

ప్రభా : ఎట్లాగ వినేది ? నాన్నగారు.

ఉ॥ మానసికంబుగాఁగ, నొకమాన్యునిఁ దొల్త, వివాహమాడి, నా
మానసమా. విశాలమతి మంతునకుం బహుమాన మిచ్చి, త
న్మానసమున్, గ్రహించితిని, మక్కువనై యిదిలోకసమ్మతం
బైన పథంబు, కన్యకల కాచరణీయ, విధంబుధాత్రిపై

ధర్మ : అయితే నా ఆర్థిక దుస్థితిని ఆలోచించకుండా మాట్లాడ్డం ఆడపిల్లలకు ధర్మమంటావా ?

ప్రభా : కాక తలిదండ్రులు తమతల భారాన్ని తగ్గించుకోవడం కోసం, తమస్వార్థంకోసం యువతీ యువకుల కోర్కెలకు విరుద్ధంగా వివాహాలు చేస్తామనడం ధర్మమంటారా మరి ?

భాస్క : (కంగారుగా ప్రవేశించి) కాలప్రవాహానికి గట్టు వేయడం మనవల్లకాదు చెల్లాయ్ !

ప్రభా : కాదని మనంకూడా దానిలో కొట్టుకుని పోవలసిందే నంటావా ? అన్నాయ్ !

భాస్క : కొట్టుకుని పోక గడ్డిపోచను పట్టుకుని యేటికి యెదురీదగలమా ?

ప్రభా : ఏమిటన్నాయ్ ! నీవుకూడా యిలా మాటాడుతున్నావ్ !

ధర్మ : ఈవేళ యింత త్వరగా వచ్చావ్ ! అక్కడి విశేషాలేమిటబ్బాయ్ !

భాస్క : (విచారంగా) విశేషమేమీ జరిగింది ?

ధర్మ : (సందేహంగా) దౌర్జన్యానికి కూడా తలపడ్డారా ?

భాస్క : తలపడడమే కాదు. శ్రీహరిరావుగారు దారుణంగా అమర్‌నాథ్‌ని తలపన్నుగజ్జతో భల్లున చితుకగొట్టేరు.

ధర్మ : పగలగొట్టడమే!

ప్రభా : (వ్యాకులపాటుతో) ఆస్తినంతా అపహరించాలనే ఆశయంతో ప్రాణాలు తీయడానికికూడా పాల్పడ్డారన్న మాట.

భాస్క : అవును అమర్‌నాథ్ బ్రతికుంటే మన ఆట కట్టేట్టు వుందని గణపతిగారు చెప్పిన వుల్లవిరుపుమాటలు వుర స్కరించుకుని శ్రీహరిరావుగారు అన్యాయంగా అమర్ నాథుని తనపొట్టపెట్టుకున్నారు.

ప్రభా : (దుఃఖావేశంతో మూర్ఛపోవును)

ధర్మ : (వెంటనే ప్రభావతిని లేవదీసి తనఒడిలో కూర్చోబెట్టుకొనును)

భాస్క : (నీళ్ళుతెచ్చి ప్రభావతి ముఖముమీద కొట్టును)

ప్రభా : (సేదదేరి విధివిధానానికి విచారిస్తూ మౌనముగా కూర్చొని వుండును)

ధర్మ : డాక్టరుగారిని పిలిపించలేదా? భాస్కరరావు!

భాస్క : పిలిపించకేమండి? ధర్మాసుపత్రి డాక్టరుగారున్నారుగా?

ప్రభా : (నెమ్మదిగా) డాక్టరుగారువచ్చి యేమన్నారు? అన్నాయ్!

భాస్క : (విచారంగా) గరిటెడునీళ్ళుకూడా త్రాగలేని విషమ స్థితిలో వుండగా డాక్టరు మాత్రం యేంచెప్పతాడు? చెల్లాయ్!

ధర్మ : వెంటనే విలువైన ఇంజెక్షన్లిస్తే వేడిచేసి స్మారకం వచ్చునేమో! పాపం.

భాస్క : బాగుచేయించి బ్రతికించాలనేభావం కలవారయితే ధర్మాసుపత్రికే, యెందుకు పంపిస్తారు?

ప్రభా : ఇంటివద్ద యేమీచేయించకుండా వెంటనే ఆసుపత్రికి పంపించివేశారా?

భాస్క : పంపించడమేకాదు. అపాయంవచ్చినా తమమీద కేమీ రాకుండా గణపతిగారిద్వారా మునసబ్ గారి కిచ్చేముడుపులు మునసబ్ గారికి, కరణంగారికిచ్చే కానుకలు కరణంగారికి, పంపించి మేడమెట్లనుంచి కాలు జారిపడితే తలకాయ చిటికిందని తమ ధర్మాసుపత్రి డాక్టరుగారితో పత్రంవ్రాయించుకుని శ్రీహరిరావు గారు యింటివద్ద నిర్విచారంగా కూర్చున్నారు!

ధర్మ : ధర్మాసుపత్రినుంచి తప్పించి మీసంఘంవారయినా మరో ఆసుపత్రిక్కి పంపించకపోయారా? అబ్బాయ్!

భాస్క : సహోదయ సమాజాశ్రమానికి తీసుకొని వెళ్ళమని చెప్పే యిలా వచ్చాను.

ప్రభా : (నిట్టూర్పువిడిచి) యెక్కడికితీసుకుని వెళ్ళి యేంలాభం!

ధర్మ : మానవప్రయత్నంచేసి భగవంతునిమీద భారంవేయ డమేగా? మనవల్ల అయ్యేదని?

ప్రభా : పూర్ణయౌవనంకాలంలో ప్రళయమేఘాలావరించిపిడుగు పాటయ్యేకకూడా ఆ పిచ్చినమ్మకాలెందుకు నాన్నగారు.

ధర్మ : యేనమ్మకం పెట్టుకోక మనంచేసేదేముంది!

ప్రభా : (ధైర్యంగా) చేసేదెందుకులేదు?

ధర్మ : ఏముందంటావ్!

ప్రభా : జరిగిందేదో జరిగిపోయింది? ఇంక మీ యిష్టప్రకారం శ్రీహరిరావుగారిని పెండ్లాడడమే? నా కర్తవ్యం!

భాస్క : (ఆశ్చర్యంగా) మతిచెడి మాట్లాడుతున్నావా? చెల్లాయ్!

ప్రభా : మతిచెడి నేనేమీ మాటాడ్డంలేదన్నాయ్!

భాస్క : అయితే! నీవనేదేమిటి?

ప్రభా : నేననేది తరువాత చెబుతా! నాన్నగారూ! శ్రీవారు పంపించిన బంగారం నాచేతికిచ్చి, యిప్పుడే మీరు బయలుదేరివెళ్ళి ఇరువదివేలరూపాయలనోటు జమ కట్టించి, యింకాయిస్తామన్న బంగారం తీసుకుని, వీలయి నంత త్వరలో ముహూర్తంపెట్టించి పంపమని చెప్పి రండి!

భాస్క : (ఆక్షేపణగా) భాగ్యవంతుడు భర్తఅయితే బంగారం తినవచ్చునని భావిస్తున్నావా?

ప్రభా : అవునన్నాయ్! ఉన్నవారిని వివాహమాడి, పెండ్లి పీటలమీద ముండమోపినయినా! బ్రతికినంతకాలం అన్నిరుచులు ఆరగిస్తూ హాయిగా సుఖం అనుభవించ వచ్చు.

భాస్క : అంటే!

ప్రభా : అంటే! ఏముంది? ప్రథమంలో పరిణయమాడాలన్న వారు ప్రమాదానికి లోనయ్యేరుగనుక, నేను నాన్న గారి అభిప్రాయంతో యేకీభవించేను.

భాస్క : అదేం వీల్లేదు. చల్లాయ్!

ప్రభా : ఎందుకు వీల్లేదన్నాయ్! నాన్నగారిమాట ప్రకారం వర్తించడమే ప్రస్తుతం నా ప్రధానాశయం.

భాస్క : (తెల్లబోయి) కర్తవ్యతావిమూఢవై, గండకత్తెరలో కంఠం పెడతావా? చెల్లాయ్!

ప్రభా : నాకష్టసుఖాలు,నాబాగోగులు నాకు తెలియవంటావా? అన్నాయ్!

భాస్క : ఏమిటి నీకు తెలిసింది? తీగెలు తెగినవీణమీద సంగీతాన్ని సాదనంచేస్తాననడమేనా?

ప్రభా : నాపెండ్లిగురించి నాన్నగారిని ఆర్థికంగా యిబ్బంది పెట్టడానికి యిష్టంలేక నామనస్సును ఇలా మార్చుకున్నాను. వెళ్ళుఅన్నాయ్! ఇంకనీవు చెప్పేదేమీ లేదు. నాన్నగారు! యీ సాయంత్రంలోపున మీరు

ముహూర్తం పెట్టించుకుని రాకపోయారా! తెల్లవారే సరికి నాశనాన్ని కళ్ళచూస్తారు వెళ్ళండి! యిప్పుడే వెళ్ళండి.

భాస్క : నాన్నగారు! చెల్లాయి పిచ్చిమాట్లాడుతోంది! మీరు ఇప్పుడు యెక్కడికీ వెళ్ళవద్దు.

ప్రభా : (ఆవేశంగా) వెళ్ళాలి. ఇప్పుడే వెళ్ళాలి వెళ్ళకపోతే! నేనుచెప్పినంతపని చేయకమానను.

ధర్మ : (భయంతో) వెళతానమ్మ వెళతాను. (వెళ్లును)

భాస్క : (ఉద్రేకంగా) చెల్లాయ్! నీవింత నీచురాలవు అయిపోతావని అనుకోలేదు. అనుభవిస్తావులే (వేగంగా వెళ్ళిపోవును)

ప్రభా : ఎంతఅమాయకులు? వీరికి నాకర్తవ్యం యేంతెలుసు పాపం? (వెళ్ళును)

(తెరపడును)

శ్రీః

# కన్నకూతురు

## [నవమదృశ్యం]

(సర్వోదయ సమాజాశ్రమం, దయానందస్వామి ఉన్నతాసనమున కూర్చుండి సభ్యులతో, బృందగానం చేస్తూ వుంటారు)

"రఘుపతిరాఘవ ! రాజారామ్
పతితపావన ! సీతారామ్ ॥రఘు॥
ఈశ్వర ! అల్లా ! తేరే, నామ్
సబ్‌కో సన్మతిదే భగవాన్ ॥రఘు॥
సుందర విగ్రహా ! మేఘశ్యామ్
గంగాతులసీ సాలిగ్రామ్" ॥రఘు॥

భాస్క : (ప్రవేశించి) నమస్కారం స్వామి !

దయా : (చూచి)దీర్ఘాయుష్మాన్‌భవ. ఎవరవునాయనా ! నీవు?

భాస్క : దానాల ధర్మయ్యగారి కుమారుణ్ణండి స్వామి !

దయా : ఓహో ! ధర్మయ్యగారి అబ్బాయివా ? నీపేరు ?

భాస్క : భాస్కరరావంటారు స్వామి !

దయా : మీ గ్రామ యువజన సంఘ కార్యదర్శివి నీవేగా ?

భాస్క : చిత్తం స్వామి !

దయా : రాత్రి మీ సంఘసభ్యులు చావుబ్రతుకుల్లో వున్న అమర్‌నాథుడనే యువకుణ్ని మా ఆశ్రమానికి తీసుకుని వచ్చారు.

భాస్క : (ఆత్రుతగా) బ్రతికియున్నాడా స్వామి!

దయా : భగవదనుగ్రహంవల్ల ప్రమాదంతప్పి బ్రతికిబయటపడ్డాడు.

భాస్క : (ఆనందంగా) ధన్యులయ్యాం స్వామీ! మీ అనుగ్రహంవల్ల మా అమర్‌నాథ్ సార్థక నామధేయుడయ్యాడు.

దయా : దీనావన దీక్షుతుడయిన ఆజగదీశ్వరుని అనుగ్రహమే గాని నా కర్తృత్వమేమీ లేదు నాయనా!

భాస్క : ఆదయామయుని అవతారావతారులయిన, మీ అమృత హస్తం, సంజీవినిలా, చనిపోయేడన్న, మామిత్రుణ్ణి పునర్జన్ముని చేసింది స్వామీ!

దయా : దైవమనుకూలంగా వుంది గనుక మీ మిత్రుడు బ్రతికేడు. లేకపోతే ఆవుయువట్టున తగిలిన ఆదెబ్బకు అందరు బ్రతుకరు.

భాస్క : ధర్మాసుపత్రి డాక్టరుగారు బ్రతకడని పెడిచిపెట్టేక, దైవం మీద భారంవేసి మాసంఘ సభ్యులు సాహసించి మీ ఆశ్రమానికి తీసుకుని వచ్చారు.

దయా : అయితే! అలా కొట్టింది అతని మేనమామగారే నటగా?

భాస్క : (శోకంగా) అవునండి ! ఆపరమ దౌర్భాగ్య దామోదరులే ! ఈపాపానికి ఒడిగట్టిన పాషాణ హృదయులు.

దయా : దయాదాక్షిణ్యాలులేని వారికి ధర్మాధర్మ వివక్షత వుండదుగా ?

భాస్క : ధనదేవతా వేశంతో శివమెత్తిన చండాలునికి దయా దాక్షిణ్యాలు ఎలావుంటాయి స్వామీ !

దయా : లోకంలో తెలిసి పాపాలుచేసి తెలియక దానిఫలితాన్ని అనుభవిస్తారు.

భాస్క : "గోరుచుట్టుమీద రోకటిపోటు"న్నట్లు రాత్రి మా చెల్లాయి కూడా మాయమయి పోయింది.

దయా : (సందేహంతో) ఆమెకెన్నేళ్లుంటాయి ?

భాస్క : పదునాలుగేళ్ళు దాటివుంటాయి స్వామి !

దయా : ఆమె ఎరుపా ? నలుపా ?

భాస్క : నిమ్మపండులా పచ్చగా నిగనిగలాడుతూ వుంటుంది.

దయా : (సందేహంగా) అయితే ! ఈ తెల్లవారుజామున నదిలో కొట్టుకుంటూవస్తూ మాకు దొరికిన అమ్మాయి మీ చెల్లాయి కాదుగదా ?

భాస్క : (ఆత్రుతగా) ఈయేటిలో దొరికిందా ? స్వామి !

దయా : అవును. ఆమెకు నదిలో పడవలసిన అగత్యం యేం వచ్చిందంటావ్.

భాస్క : మా అమర్‌నాథునికీ యవర్థం వచ్చిందని విని పిచ్చెత్తి అల్లాంటి పనిచేసిందేమో !

దయా : ఆమెకు అలాంటిపని చేయవలసిన అవసరం యేముంది?

భాస్క : ఆ విషయం ఆ తరువాత చెబుతాగానండి ఆ యిద్దరు ఇప్పుడెక్కడున్నారు? స్వామి!

దయా : (వ్రేలితో కనపరస్తూ) అదిగో! అమర్‌నాథ్ ఆ ఆరవ నెంబర గదిలో వున్నాడు ఆమె మాత్రం యింకా వైద్యం పొందుతూ మా డాక్టరు ఒడ్డికలోనే వుంది. ఇప్పుడే నే నక్కడి నుంచి వచ్చాను.

భాస్క : నేను వెళ్ళి వారిని చూచి రావచ్చునా స్వామి?

దయా : ముందు ఆ ఆరవ నెంబరు గదికి వెళ్ళి అమర్‌నాథుని చూచి, యిక్కడికి వస్తే, ఇద్దరంకలసి యీ అమ్మాయి వున్న చోటుకు వెళదాం.

భాస్క : సరే! నమస్కారం స్వామీ! (వెళ్ళును)

దయా : విధివిధానం ఎంతటి వారికయినా తప్పదు.

డాక్ట : (ప్రవేశించి) నమస్కారం స్వామి!

దయా : (చూచి సందేహంతో) ఏం డాక్టరు! ఆ అమ్మాయికి ఎలావుంది? ఇంకా లేచి మాట్లాడ్డం లేదా?

డాక్ట : మాట్లాడకేవుంది! మరలా 'ఏటి కోవడ తా విడిచి పెట్టం" డంటూ వెళ్ళిపోవడానికి సిద్ధపడింది.

దయా : అలాంటప్పుడు ఆమెను విడిచిపెట్టి యిలా యెందుకు వచ్చావ్!

డాక్ట : కదలడానికి వీల్లేదని కనుసైగనే సరికే స్వామి వద్దకు నేనుకూడా వస్తానంటూ బయలు దేరింది.

దయా : నీవు యిట్లా రావడం చూచి పరుగున పోయి నదిలో పడదుగదా ?

డాక్ట : వెంకయ్య తాతను వెంటబెట్టుకుని రమ్మని మీకొక విచిత్ర విషయం చెప్పడానికి ముందుగా వచ్చాను.

దయా : ఏమిటా విచిత్ర విషయం ?

డాక్ట : ఆమె పొట్టమీద మన ఆశ్రమచిహ్నా లున్నాయి స్వామి !

దయా : ఎందుకుంటాయి

డాక్ట : ఏమో ! స్వామి ! స్పష్టంగా పొట్టమీద చంద్రకళా చిహ్నాలు చూసేసరికి నాకుకూడా ఆశ్చర్యంవేసింది.

దయా : అయితే ఈమె మన ఆశ్రమంలోనే పుట్టిందంటావా?

డాక్ట : తప్పకుండాను

దయా : (ఆలోచించి జ్ఞప్తినభినయించి) పదునాలుగేళ్ళకు పూర్వం మనఆశ్రమంలో ఒక అభాగిని ప్రసవించి పది రోజులు గడిచేక పరారి అయింది, జ్ఞాపకముందా?

డాక్ట : (జ్ఞప్తినభినయించి) అవునండి! ఆనాడు ఆమె వ్రాసి తనగదిలో పారవైచినలేఖకూడా మీరు చదువుకుని దానిలోని విషయం తరువాత చెబుతానన్నారు కూడాను.

దయా : అవును. ఆలేఖ యింకా నాపెట్టెలోనే వుంటుంది.

డాక్ట : పాపం ఆనాడు అదృశ్యురాలయిన ఆ అభాగినిజాడ యింతవరకు మనకేమీ, తెలియలేదుగదండి! స్వామి.

దయా : తెలియదు లేదు కాని యీనాటు ఆ అభాగిని కూతురేమో?
పాపం!

డాక్ట : ఆమె కూతురే అయితే! ఇప్పుడీమెవల్ల మనకు నిజం
తెలుస్తుందిగదండి (ప్రభావతి రాకనుచూచి) అదిగో! ఈమె
కూడా రానేవచ్చింది స్వామీ!

ప్రభా : (విరబోసివున్న తలతో పిచ్చిదానిలా ప్రవేశించి)
నమస్కారం స్వామీ!

దయా : (చేయెత్తి) దీర్ఘసుమంగళీభవ!

ప్రభా : చీకటిముసుగులో దాగివున్న నాకు వెన్నెల వెలుగు
చూడగల యోగ్యతవుంచు! మృత్యుదేవత నెందుకు
ఆహ్వానిస్తాను? స్వామి!

దయా : ఆత్మహత్య మహాపాపమని తెలియదా? అమ్మాయి!

ప్రభా : తెలిసి జీవచ్ఛవాన్నయి జీవించమంటారా? స్వామి!

దయా : జీవించక? చచ్చి ఎవరిని సాధిస్తావ్!

ప్రభా : కర్మదేవత నన్ను తనకాలు పెట్టి నేలరాసి వేసింది.
ఈ జన్మలో నేనింక చినిగిపోయిన గాలిపటంలా జీవించి
అనుభవించే దేమీ లేదు స్వామి!

దయా : లేదని నీవెట్లా చెప్పగలవు?

ప్రభా : సంఘశాసనాన్ని ఉల్లంఘించడం సాధ్యం కానప్పుడు
ఎవరయినా చేసేదం లేనా? స్వామి!

దయా : సంఘాన్ని ఎదిరించి కార్యాన్ని సాధించుకోవాలి గాని
ఆత్మస్వాతంత్ర్యాన్ని అగ్గిపాలు చేసుకుంటావా?

ప్రభా : అంతఆత్మశక్తి కలదాన్ని కాకనే నా భగ్నజీవితాన్ని ఇంతటితో చాలించి సుఖదుఃఖరహితమయిన సుస్థిర లోకాన్ని చేరదలచేను స్వామి!

డాక్ట : నీ బ్రతుకుమీద నీకింత నిరాశకలగడానికి కారణం చెప్ప కూడదా! అమ్మాయి.

ప్రభా : చెప్పి ప్రయోజనమేముంది? డాక్టర్.

దయా : చెప్పితీరాలి.

ప్రభా : నేవివాహమాడదలచినవారు ఇహలోకయాత్ర, ముగిం చేరని, విని, భర్తృసహగమనానికి సాహసించేనుస్వామి!

దయా : భర్తృసహగమనమా? ఎవరమ్మా! నీభర్త!

ప్రభా : ఎవరయితేంలెండి స్వామి !

దయా : అమర్‌నాథేనా?

ప్రభా : (గొల్లునయేడుస్తూ అవునండి అంటూ స్వామికాళ్ళపై పడును)

డాక్ట : (ఆశ్చర్యంగా) అమర్‌నాథా! అయితే అతడు మా ఆశ్రమంలో చికిత్సపొంది హాయిగా వున్నాడమ్మా!

ప్రభా : (పరమానందంగా) నిజంగానా? డాక్టరుగారూ?

దయా : నిజంగాక అబద్ధంచెబుతామా? ఇప్పుడే మీ అన్న భాస్కరరావువచ్చి ఆ అమర్‌నాథుని చూడడానికి ఆ ఆరవనెంబరుగదికి వెళ్ళేడు.

ప్రభా : (ఆనందపారవశ్యంతో) ఆ! మా అన్నయ్యకూడా వచ్చాడా? నా అమర్‌నాథ్ బ్రతికివున్నారా!

భాస్క : (ప్రవేశిస్తూ) బ్రతికేవున్నాడు చెల్లాయ్! ఇప్పుడే నేను చూచివచ్చాను.

ప్రభా : (సంతోషంతో అన్నాయ్ అంటూ గభాలున కౌగలించుకొనును)

భాస్క : స్వామివారి దయామృతం మీ యిరువురిపయిని వర్షించగా మీ పవిత్ర ప్రణయాంకురాలు ఎలాకుళ్ళి పోతాయి! చెల్లాయ్!

దయా : ఆదర్శ దాంపత్య ప్రభావమే వీరి ప్రేమజ్యోతుల పునః ప్రజ్వలనానికి పునాది అంతేగాని, నాశక్తియేమీ కాదు నాయనా!

డాక్ట : భాస్కరరావ్! మీ తల్లిగారిపేరు......

సత్య : అన్నపూర్ణమ్మగారు.

దయా : సత్యవతి అని మరియొక పేరేమయినా వుందా?

భాస్క : లేదు స్వామి!

దయా : అయితే డాక్టర్! ఈమె ఆ సత్యవతి కూతురు ఎలా అవుతుంది?

డాక్ట : కాకపోవచ్చు, కాని యీమె మాత్రం మన ఆశ్రమం లో పుట్టినమాట తథ్యం స్వామి!

(లోపల భోజనంగంట మ్రోగును)

దయా : సరే! ఆవిషయం ఆ తరువాత ఆలోచించుకుందాం భోజనంగంట మ్రోగింది లేవండి.

(అందరు వెళ్ళుదురు)

(తెరపడును)

శ్రీః

# కన్నకూతురు

[దశమదృశ్యం]

(సర్వోదయ సమాజాశ్రమం. దయానందస్వామి ధర్మయ్యతో యథాస్థాసనములపై కూర్చుండి మాట్లాడుతూ వుంటారు)

దయా : అదికాదు. ధర్మయ్యగారు! ప్రభావతి మీకు కన్న కూతురేనా? అని నేనడిగేం ప్రశ్న.

ధర్మ : మీకా సందేహం ఎందుకు కలిగింది స్వామి!

దయా : ఆవిషయం నాకు చెబుతేగాని మీకు నేనొక శుభ సందేశాన్ని విని పించడానికి వీలుండదు.

ధర్మ : కన్నకూతురు కాదుగాని అంతకంటే అధికంగా చూచుకున్నాం స్వామి!

దయా : చూడడం లేదనికాదు. ధర్మయ్యగారూ! ఇంతవరకు ఈమె మీ కన్నకూతురనే యెన్నో తికమకలు పడ్డాం.

ధర్మ : అలాంటిధర్మ సందేహం మీకెందుకు కలిగింది! స్వామి!

దయా : ఆ విషయం మీకు తరువాత చెబుతాగాని, యీమె కన్నతల్లి యెవరో మీరు చెప్పగలరా?

ధర్మ ! కన్నతల్లి యెవరో ! కన్నతండ్రి యెవరో, నాకేమీ తెలియదు ..గాని స్వామి ! ఈ మాపాపాయి యిది వొక పెద్ద విచిత్రగాధ.

దయా : ఆగాథే ఇప్పుడు చెప్పాలి ధర్మయ్యగారు.

ధర్మ : ఇప్పటికి పదునాలుగేళ్ళకు పూర్వం ఒకనాటిరాత్రి వేకువ జామున పాలబుగ్గల పసిపాప మావీధి అరుగుమీద కేర్ కేర్ మంటూ యేడుస్తూ పడివుండగా నేనూ నాభార్యవచ్చి చూశాం. అక్కడ ఒక పాపాయితప్ప మరియెవరు లేకపోవడానికి ఆశ్చర్యపడ్డాం.

దయా : ఆశ్చర్యంకాదు మరి ?

ధర్మ : భగవంతుడు మాకీ బంగారు పాపాయిని ప్రసాదించి పాపాయిలేని లోటు తీర్చేడని పరమానంద భరితుల మయ్యాం కూడా స్వామి !

దయా : అబ్బ ! ఇప్పటితో నా సందేహ నివృత్తి అయింది ధర్మయ్యగారు.

ధర్మ : మీకు గలిగిన సందేహమెందుకో అని మాత్రం నా సందేహం తీరలేదు.

దయా : (చెవిలో నెమ్మదిగా చెప్పును)

ధర్మ : (ఆనందంతో) నిజమేనా ? స్వామి !

దయా : ఆధారంలేని మాట నే నెందుకంటాను.

ధర్మ : అయితే ! మీ అనుగ్రహంవల్ల ఘోరపాపానికి గురి కాకుండా తప్పి ధన్యులమయ్యాం స్వామి !

దయా : దైవాను గ్రహంవల్ల సత్యం బయటపడింది గనుకనే సత్యవతీదేవి శీలవతిగా ప్రభావతి సౌభాగ్యవతిగా చరిత్రలో సువర్ణాక్షరాలతో చిరస్థాయిగా చిత్రింపబడ గలిగేరు !

ధర్మ : అయితే! స్వామి! మీరు శ్రీహరిరావుగారికి గణపతితో కలిసి రమ్మనే కబురుపెట్టేరా ?

దయా : గణపతిగారితో కలిసి రాకపోతే శ్రీహరిరావుగారి జీవిత నాటకం సుఖాంతంగా పూర్తికాదు గదండి !

ధర్మ : (చూచి) అదుగో, ఆ ఇరువురు కలిసే మీరన్న ప్రకారం వస్తున్నారు.

శ్రీహ : (ప్రవేశించి) నమస్కారం స్వామి !

గణ : (సమీపించి) నమస్కారం స్వామి !

దయా : (లేచి చేయియెత్తి) ఆయురారోగ్యాభివృద్ధిరస్తు. దయచేయండి !

శ్రీహ : మాకంటే ముందుగా ధర్మయ్యగారే దయచేసేరే ! (అంటూ కుర్చీలో కూర్చొనును)

గణ : శ్రీహరిరావుగారి వంటి శ్రీమంతుల్ని చెందనాడుకోనడం శ్రేయస్సనే తలచేరా ధర్మయ్యగారు ? (కూర్చొనును)

శ్రీహ : (ఆ సూయగా) "ఏరుదాటి తెప్పతగలేసే మనుష్యులతో వ్యవహారాలు ఎలా వుంటాయనుకున్నావ్ ! మరి ?

ధర్మ : ధర్మపన్నాలు చెప్పేవారే యెక్కువగా దారుణ కృత్యాలు చేస్తారు.

శ్రీహ : (కోపంతో) ఏమిటి ధర్మయ్యగారు మీరనేది ?

ధర్మ : ఏముంది? ఉన్నమాటే అన్నాను.

గణ : (కోపంతో) ఏమిటావున్నమాట!

శ్రీహ : ఏమిటంటావా? మొదటనాకిచ్చి పెండ్లిచేస్తానన్న తన కూతుర్ని ఆశ్రమంలోపెట్టి నన్ను మాయచేయడానికి ప్రయత్నించడమే !

గణ : మాయచేయడానికి పీరువ్రాయించియిచ్చిన శుభలేఖ కూడా మాదికాదంటారా?

శ్రీహ : ఆ ఆధారమే మనకు లేకపోతే! ఇరువదివేలరూపాయ లకు పరువునష్టందావా వేయడానికి దారికూడా మనకు లేకపోయేదేగా?

ధర్మ : మీవ్యవహారం పరువునష్టందావావరకుకూడా వచ్చిం దన్నమాట

గణ : రాక? ఇరువదివేలరూపాయలనోటు, అరవయికాసుల బంగారం, మీపరంచేసి నోరుమూసుకుని వ్రూరుకుంటా మనుకున్నారా?

శ్రీహ : ఆనాడు అటుచేతిలో వైకుంఠంచూపించి మీపని మీ కన్యక పెండ్లికూతురు కనబడలేదనడమేనా! పెద్ద మనిషితనం? ధర్మయ్యగారు.

దయా : గతించిన విషయాలగురించి కలహంపెట్టుకొని కలసి వచ్చే దేమీలేదు.

శ్రీహ : సరే! స్వామి! పెండ్లి కూతురు మీ ఆశ్రమంలో వుందని మాకు కబురచేసేరు గనుక.........

గణ : ముందుజరుగవలసిన కార్యక్రమాన్ని సక్రమంగా జరిగించే బాధ్యతమాత్రం మీది.

దయా : దానికేం? ధర్మంప్రకారం వివాహం ఆశ్రమంలోనే జరిగించడానికి మా అభ్యంతర మేమీ వుండదు.

శ్రీహ : సంతోషం! మీ చేతులతో నన్నొక గృహస్థుని చేయడంకంటే నాకేం కావాలి? స్వామి

దయా : శ్రీహరిరావుగారూ! ఇప్పుడు కొన్ని నామాటలకు మీరు సరియయిన సమాధానం యిస్తారా?

శ్రీహ : భగవంతుని సాక్షిగా ప్రమాణంచేసి మరీ యిస్తాను అడగండి స్వామి!

దయా : పదునాలుగేండ్లకుముందు మీ యింట్లో సత్యవతిఅనే అమ్మాయి కొన్నాళ్లు వున్నట్లు జ్ఞాపకంవుందా?

శ్రీహ : (కొంచెంకంగారుపడి తమాయించుకొని) జ్ఞాపకం లేకేమండి! కొన్నాళ్ళుకాదు కొన్నేళ్ళువుంది.

దయా : అయితే! ఆమెగుణశీలాలు యెలాంటివో, మీకు బాగా గుర్తున్నవా?

శ్రీహ : (ఇంకాకంగారుపడి తికమకలు పడును)

గణ : (అందుకొని) ఆమె వీరియింటనుండే రోజుల్లో శీలవతి గానే కాలక్షేపం చేసిందిస్వామి!

దయా : ఆమెను పెండ్లాడడానికి రావుగారేమయినా ప్రయత్నంచేశారా?

గణ : చేసినమాట సత్యమేగాని స్వామి! అప్పటికి వీరికి ఏల్నాటిశని యేదోవుండి పెండ్లిచేసుకోవడానికి వీల యిందికాదు.

దయా : వీలుకాలేదని ఆమె మీాయిష్టంబూదే వెళ్ళిపోయిందా?

శ్రీహ : (గడగడవణుకుచు) చిత్తం స్వామి!

దయా : ఎక్కడికి వెళ్ళిపోయిందో మీారేమయినా చెప్ప గలరా?

గణ : పుట్టింటికేపోయి వుంటుందని వూహించాం కాని అక్క డికిపూడా వెళ్లలేదని విని చాలా విచారించాం స్వామి!

భాస్క : (గభాలున ప్రవేశించి క్రోధావేశంతో) విచారిం చారు! ఆ సాధ్వీమణి జీవితవృక్షాన్ని కూకటివ్రేళ్ళతో కూలద్రోసి, చాలావిచారించేరు! అర్థబలంగల మన మేంచేసినా, చెల్లించుకోగలమని కండకావరంతో కళ్ళునెత్తికెక్కి ఆత్మద్రోహం వంశద్రోహం సంఘ ద్రోహంకూడాచేసి మానవజాతికే చీడపురుగులమయి, ప్రస్తుతమన్నమాట మరచి, యింకా మనుష్యులమనుకునే మీారు యీాస్వామివారియెదుట మాట్లాడుతున్నారా?

కండ్లు పొరలుగ్రమ్మి అరిషడ్వర్గాన్ని అరికట్టుకోలేక ఆ సత్యవతీదేవికి చేసిన మహాద్రోహానికి తోడు కన్న కూతుర్నే కామించి పెండ్లిచేసుకోవాలని తలచిన ఈ శ్రీహరిరావు మానవజన్మమెత్తి నేయి అన్నం తినేమనుష్యుడో! మృగజన్మమెత్తి గడ్డిగాదరతినే పశువో! చెప్పండి స్వామి! దేవాలయానికి గుమాస్తాగిరిచేస్తూ "చెప్పేవి శ్రీరంగనీతులు దూరేవి దొమ్మరగుడిసెలు" అనే సామ్యంగా సంచరిస్తూ పైమెరుగుమాటల్తో ప్రపంచాన్ని మోసగిస్తూ బ్రతుకుతూవుండే ఈ గణపతిని పయోముఖవిషకుంభమనాలో, గోముఖ వ్యాఘ్రమనాలో! చెప్పండి స్వామి!

దయా : ఆగునాయనా! అప్పుడే అంత ఉడుకుజుట్టుకుంటా వెందుకు?

శ్రీహ : (నిర్ఘాంతపోయి) ఏమిటండి స్వామి! ఈ గంద్రగోళమంతా!

దయా : ఏమిటంటూరా? ఇంకొక నిమిషంలో విూ చెవులారా వింటూరు (బిగ్గరగా) డాక్టర్! డాక్టర్! ఇంకా నీకు ఆ కవరు కనుపించలేదా?

డాక్ట : (కనిపించింది స్వామి అంటూ ప్రవేశించి) ఇదిగో నండి! (కవరు చేతికీయబోవును)

దయా : నాచేతికి ఇవ్వడానికికాదు డాక్టర్! నీవే ఆ కవరులోని కాగితంతీసి దానిలోని విషయాన్ని ఆమూలాగ్రంగా చదివి మా అందరికి వినిపించాలి.

డాక్ట : చిత్తంస్వామి! (కవరులోని కాగితంతీసి చదువును) శ్రీపరబ్రహ్మ స్వరూపులయిన స్వామివారి దివ్యసముఖానికి మీశిష్యురాలు చందనం సత్యవతి వందనములతో వ్రాసుకును విజ్ఞాపనము. మహోదయ! ప్రత్యక్షంగా నా కన్నీటిగాధను మీకు చెప్పుకునే సాహసం లేక పరోక్షంగా నాయీలేఖ ద్వారా చెప్పుకొను చున్నందుకు క్షమింప ప్రార్థన. నేను పుష్పగిరి వాస్తవ్యులు జానకీ దామోదరులను పుణ్యదంపతులకు పుట్టిన అభాగ్యురాలను శ్రీహరిరావుగారి రెండవ భార్య గౌరీదేవికి చిన్నతనం నుంచి చెలికత్తెగా వుంటూ ఆమె అత్తవారింటికి వచ్చునప్పుడు ఆమెతో నేను కూడా శ్రీపురం రావుగారి యింటికివచ్చి, ఉండిపోయేను. పాపం గౌరీదేవి కాలవాహినిలో కలిసిపోయినా నేను శ్రీరావుగారి మాటనమ్మి మా యింటికి వెళ్ళలేక పోయేను. రజస్వలనయిన్నప్పు నన్ను చూచి రావుగారు నేనెంత కాదన్నా నా ... పెండ్లాడతానని, నా శీలాన్ని చెడగొట్టేరు. చివరకు గర్భవతినయ్యేక పెళ్లాడమని నేనెంత యేడ్చినా వినిపించుకోక పుట్టింటికి

పొమ్మని, లేకపోతే ప్రాణాలు తీస్తానని పరవళ్లు త్రొక్కేరు. కసాయివాని కాళ్ళక్రింది మేకపిల్లలా, గడ గడ లాడిపోయేను. గత్యంతరం లేకపోయింది. ఆ రాత్రి కన్ను పొడుచుకున్నా కనుపించని చీకట్లో ఎవరికంటా పడకుండా ఊరుదాటి వెళ్ళిపోయేను. ఎనిమిదిమాసాలు అజ్ఞాతవాసం చేసి రైతుబాబుల సహాయంతో మీ ఆశ్రమం చేరుకున్నాను. ఆనాటి నాస్థితిలో ఆదుకుని మీరూ మీ డాక్టర్‌గారు నాకు వేసిన మహోపకారా నికి జన్మజన్మకు కృతజ్ఞురాలనయి వుంటాను. నాకడుపు పంట అయిన నా పాపాయి, నాలా దురదృష్టవంతు రాలు కాక, ఎప్పటికయినా, మీకంటబడితే, పలానా చందనం శ్రీహరిరావుగారి వంశాంకురమని మాత్రం వెల్లడించి నన్ను శీలవతినిగా చేసి మా భారతనారీ మణుల ప్రఖ్యాతిని కాపాడండి. ఆనాడుగాని నాఆత్మకు శాంతి సమకూరదు. శెలవు. ఇట్లు మీవిధేయురాలు చందనం సత్యవతిప్రవాలు.

దయా : శ్రీహరిరావుగారు! మా డాక్టర్ చదివినలేఖ మీరు సాంతంగా విన్నారుగా?

(శ్రీహరిరావు గణపతులు గడగడా వణికిపోతూ ఏమీ మాటాడరు)

దయా : (బిగ్గరగా) ప్రభావతి! ఓ ప్రభావతి (అని పిలుచును)

ప్రభా : (ప్రవేశించి) నమస్కారం. స్వామి!

దయా : మీనాన్న గారు వచ్చారు వారికినమస్కరించు. ఆశీర్వ దిస్తారు.

ప్రభా : (ధర్మయ్యగారికి నమస్కరింపబోవును)

దయా : వారికి కాదమ్మా! (శ్రీహరిరావును కనపరచి) వీరికి వీరే! నీకన్నతండ్రిగారు!

ప్రభా : (తెల్లబోయి ధర్మయ్యగారివంక చూచును)

ధర్మ : అవునమ్మా! నేను నీపెంపుడుతండ్రిని. నిన్ను కన్నవారు స్వామివారు చెప్పినట్లు వీరే! తల్లీ!

ప్రభా : (శ్రీహరిరావుగారివంకచూచి) నా...న్న...గా...రు ...న...మ...స్క...రం...

శ్రీహ : (కుర్చీలోనుంచిలేచి గద్గదస్వరంతో) తల్లీ! (కౌగలించు కొనును)

ధర్మ : (ఆనందంతో) ఆహా! నేడు ఎంతసుదినం? స్వామి!

శ్రీహ : (దయానందస్వామివారి కాళ్ళపై బడి మోకాళ్ళమీద కూర్చొని కన్నీరు కారుస్తూ గద్గదస్వరంతో) స్వామి! ఆత్మదురభిమానంతో యింతవరకు నాకతిరికి ఎదురు లేదని యెన్నెన్నో పాపాలుచేశాను. నాపాపిష్ఠిముఖాన్ని చూచినవారికి పంచమహాపాపాలు పట్టుకుంటాయి. ధనమే సర్వం అనుకుని దారుణంగా పీనుగులమీద కూడు తీసుకునితిన్న నాతో మాట్లాడినవారుకుంభీనరక పాకంలోపడి కుమిలిపోతారు. దుర్వ్యసనప్రవాహంలో కొట్టుకొనిపోతూ ఆనువంశికమర్యాదల్ని అగ్గిపాలు

చేసుకున్న నన్నుముట్టుకున్నవారు అంటరానివారయి పోతారు. అందుకు నావంటి పరమద్రోహి ప్రపంచంలో బ్రతికివుండకూడదు. నిజంగా నానికృష్టజీవితానికి నివృత్తి మరణంకంటే శరణ్యం లేనేలేదు. (దూరంగావచ్చి మొలలో బాకుతీసి పొడుచుకొనబోవును)

అమ : (గభాలున తలకట్టుతో వచ్చి వెనుకబాటున శ్రీహరి రావు గారిచేతిలోని బాకులాగికొని దూరంగా గిరటవైచి) ఏమిటి మామాజీ! ఈ మీసాహసకృత్యం?

శ్రీహ : (అమర్‌నాథుని వెర్రిగాచూచి) ఎవరవుబాబు! నీవు! మా అమర్‌నాథ్ వేనా? నీవు బ్రతికేవున్నావా? నిన్నెవరు బ్రతికించేరు? దేవతామూర్తివని తెలుసుకోలేక పోయేను. బాల్యంనుంచి నీ లేతహృదయానికి అనేక ఆఘాతాలు కలిగించేను. నీ తల చితుకగొట్టి చంపి నీ ఆస్తిని అపహరించాలనికూడా అనేక కుతంత్రాలు పన్నేను. ఇంకా నీకు క్షమింపరాని ఘోరాపరాధా లెన్నో చేసేను. వానికి ప్రతిఫలంగా నీవిప్పుడు నన్ను క్షమించడం సరియయినపనికాదు. నాయనా! నీ చేతులతో నన్ను పొడిచిచంపి, నాబోటి కృతఘ్నులికి గుణపాఠంనేర్పు, అంతేగాని బాకు నావలపారవేయడం పొరపాటు! (తలనాడించి) అవును నీవుధర్మప్రవర్తనలో దైవమన్నదను ధర్మమూర్తివి. సత్యంజయతి అనే

సన్మార్గగామివి. చీమనుసహితం త్రొక్కని అహింసావాదివి. నాలా, తల్లీ పిల్లా, అనే తారతమ్యం తెలుసుకోలేని ధర్మబాహ్యుడవుకావు నాలా పక్కింటివారు వస్తులుండడంచూస్తూ బదులుకూడా పెట్టనిపరమలోభివికావు. నాలా స్వార్థాంధతతో స్వజనుల్ని హింసించే హృదయంలేని ఘాతుకమృగానివిగావు, నాలా పొదుగుకోసి పాలుత్రాగే పోకిరీవాడవుకావు, (దగ్గరకువెళ్ళి చేతులు పట్టుకొని) ఇవి చేతులుకావు కాళ్లునాయనా! నన్ను క్షమించేనవూ? (ధర్మయ్యగారికాళ్ళుపట్టుకొని) ధర్మయ్యగారూ! మీ కుటుంబగౌరవాన్ని అర్థంచేసుకోలేక వ్యర్థంగా మీ మీద అనేక అపవాదులు వేసేను, వానికి మీరన్యథాభావించక మన్నించేనని మాటయివ్వరూ! (భాస్కరరావుచేతులు పట్టుకుని) భాస్కరరావ్! పసితనంనుంచి నీవు నిష్కామ్యబుద్ధితో విశాలదృక్పథంతో దేశానికి గ్రామానికి సంఘానికి మనోవాక్కాయకర్మలతో చేసే సేవనుచూచి సహించలేక, కండ్లలో నిప్పులు పోసుకున్నాను. కుళ్ళికుమిలిపోయేను కాని...నీవుమాత్రం పిసంయెత్తు వెనుకంజవేయక, కార్యశూరుడవయి మార్గదర్శకుడవయ్యావ్! నీవు కూడా నావయి జాలిపడి దయచూపవూ! (ఆకాశం వంకచూచి) అదిగో! నా హృదయమందిరానికి వేసిన

చీకటితలుపులను తనవెలుగు చేతులతో తెరవాలని ప్రయత్నించిన ప్రేమాధదేవత సాధ్వీమతల్లి సత్యవతీ దేవి ఆకాశంనుంచిచూస్తూ నేను వలపురోగంతో ఒడలు తెలియక తనకుచేసిన ద్రోహానికి అసహ్యాపడుతూ మీరందరు క్షమించినా తానుమాత్రం క్షమించ నంటూశపిస్తూవుంది. అవును తనవ్యక్తిత్వాన్ని నా స్వార్ధంకోసం అడవిపూసిన పూవులా వ్యర్ధంచేసిన నాకు శాస్తి కావాలని శపించక దీవిస్తుందా? అమృతభాండాన్ని హాలాహాలభాండమని అనుమానించి కాలతన్ని నేల పాలుచేసిన తెలివితక్కువవాడిలా, నీచూపుల్లోని స్వర్గీయానందాన్ని చూరగొని నారాగరసరాజ్యానికి రాణిని చేసుకోలేని దౌర్భాగ్యదామోదరచక్రవర్తినని, వికటాట్టహాసంచేస్తున్నావా? నీమాంసాన్ని కుక్కలు తినవని, నీరక్తాన్ని కాకులు ముట్టవని, నిన్ను నిలువునా తగలపెట్టినా, ప్రాణాలతో గోతిలో పాతిపెట్టినా, పాప ముండదనికదూ! తిడుతున్నావు? (చేతులుపైకెత్తి) సత్యవతీ! సత్యవతీ! నీకాళ్ళుపట్టుకుని క్షమాభిక్షపెట్ట మని కోరడానికి ఇదిగో! నేనుకూడా నీవద్దకు వస్తున్నా (అని పైకెగిరి క్రిందపడిపోవును)

దయా : (గభాలునవెళ్ళి లేవదీసి) శ్రీహరిరావుగారు! పరిస్థితు లకు లొంగితెలియక తప్పుచేసినా తెలుసుకుని సరిదిద్దు

కోపాలిగాని వ్యాకులపాటుతో గడచిపోయినదానికి వగచి కలిసిరాదు.

(పణకుచూ స్వామికి నమస్కరించి) స్వామి! వెన్న లాంటి శ్రీహరిరావుగారి మనస్సుకు యెప్పటికప్పుడు నా స్వార్థానికయి మచ్చుమందు పెడుతూ మాస్పు కలిగిస్తూ దుర్మార్గాలు చేయడానికి ద్రోహదం చేస్తూ వచ్చిన దుర్మార్గుణ్ణి నేను. మొదట పసికందువయిన నాకూతుర్ని కట్టబెట్టాలనే కాంక్షతో రావుగారికి రేమెల్మాటికిశని వుందని, యేడేండ్లు దాటితేగాని వివాహం చేసుకోవడానికి వీలులేదని జ్యోతిష్కునితో చెప్పించి సత్యవతీదేవి కాపురానికి నిప్పుపెట్టిన వాణ్ణి నేను. ఆదర్శమూర్తి అయిన ఈ అమర్‌నాథ్ మీద అనేకము లయిన నేరాలుమోపి, రావుగారికి కోపం తెప్పించి కొట్టించి డాక్టరుగారికి లంచమిచ్చి చంపించాలనికూడా ప్రయత్నించింది నేను. ఈ ప్రభావతి రావుగారిని పెండ్లి చేసుకోనని నిరాకరించినా ఈ ధర్మయ్యగారికి మాయ మాటలు చెప్పి ఒప్పించింది నేను. అంతేగాని ఈరావు గారు మాత్రం బుద్ధిపూర్వకంగా చేసిన ద్రోహమేదీ లేదు. అందుకు నాపాపానికి ప్రాయశ్చిత్తంగా నా ప్రాణాల్ని బలిచేయవలసిన కర్తవ్యం నాది (బాకు తీసి కొని పొడుచుకొన బోవును.)

భాస్క : (గణపతి చేతిలోని బాకులాగికొని) గణపతిగారు ! మీా కర్తవ్య నిర్వహణం ప్రస్తుతం ఇదికాదు. ఇంతవరకు శ్రీహరిరావుగారితో చెడుపనులు చేయించిన మీాకు ఇకనుంచి మంచిపనులు చేయించడమే మీాకు ఇహపర శ్రేయోదాయకమయిన కర్తవ్యం.

దయా : అవును. పశ్చాత్తాప జలాలతో, మీా హృదయమాలి న్యాల్ని ప్రక్షాళనం చేసుకోండి మీా మనః ప్రవృత్తుల్ని మార్చుకుని పాపాల్ని పరిహరించుకోండి అంతేగాని ప్రాణాలు తీసుకుంటే ! భగవంతుడు మెచ్చుకుంటాడా? శ్రీ హరిరావుగారు ! సత్యవతీదేవి ఆత్మకుశాంతి చేకూ రాలనే సంకల్పం మీాకుంటే ! ఆనందంగా ఆమె కుమార్తెను మీామేనల్లునికిచ్చి పాణిగ్రహణం చేయిం చండి, ఇంకా ఆ సత్యవతీదేవి పేరు చిరస్థాయిగా వుండే టట్టు ఆమెపేరిట ఒక అనాథశరణాలయాన్ని నిర్మిం చండి, అది మీా కర్తవ్యం.

శ్రీహ : చిత్తంస్వామి ! మీా ఆజ్ఞప్రకారం అమర్‌నాథ్ ఆస్తి అమర్‌నాథునికిస్తూ మా ప్రభావతినిచ్చి పాణిగ్రహణం చేయిస్తాను నా స్వంత ఆస్తినంతా వినియోగించి మీా ఆశ్రమంలోనే అనాథశరణాలయం కట్టించి నా జీవిత శేషాన్ని ఆశరణాలయ సేవలోనే గడుపుకుంటాను స్వామి.

గణ : నేనుకూడా నా ఆస్తిలో కొంత భాగాన్ని ఈ అనాథ శరణాలయానికే యిచ్చి రావుగారితో యిచటే వుండి పోతాను స్వామి.

దయా : తథాస్తు.

ధర్మ : శుభస్య శీఘ్రముగుని ప్రభావతీ అమర్‌నాథుల పాణిగ్రహణ మహోత్సవం యిప్పుడే జరిగాలి.

శ్రీహ : (సంతోషంగా ప్రభావతి చేతిని అమర్‌నాథ్ చేతిలో పెట్టును)

(ప్రభావతీ అమర్‌నాథులు స్వామికి నమస్కరింతురు.)

దయా : (చేతులెత్తి)

సీ॥ విమల స్వరూపంబు విశ్వసామ్రాజ్యంబు
భవవర్తనంబు, భూపాలనంబు,
శత్రుషడ్వర్గంబు, శత్రుకాడ్వర్గంబు,
నిర్ధశక్తుండు మరుండే నియంత,
అన్యోన్యానుస్మిత హాసముల్ సప్తాంగ
ములు, నవయౌవనము ఘనకోశ,
మోహాలు, చట్టంబు, లుజ్జ్వలా, లాపంబు
కానుక, చూడ్కు లు ఖడ్గ, వితతి,

తే॥ మీరలను, నవదంపతు, లారా! మీరు
ప్రణయ, రాజ్యైక, పాలనా, బద్ధులగుచు
స్వహిత, పరహిత, ములసమత్వముగఁ దలచి
దేశకళ్యాణ, కరకార్య, దీక్షమనుడు.

(ప్రభావతీ అమర్‌నాథులు శ్రీహరిరావుగారికి ధర్మయ్యగారికి నమస్కరింతురు వారుకూడా ఆయు రారోగ్య భాగ్యాభి వృద్ధిరస్తు, పుత్ర పౌత్రాభి వృద్ధిరస్తు అని దీవింతురు)

దయా : ఇంకా మీకేంకావాలి?

శ్రీహ : "స్వస్తిప్రజాభ్యః, పరిపాలయంతాం
న్యాయేనమార్గేణ మహీంమహీశాః

ధర్మ : గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినోభవంతు

అమ : కాలేవర్షతు పర్జన్యః
పృథివీ సస్య శాలినీ
దేశోయం క్షోభరహితో
బ్రాహ్మణాస్సంతునిర్భయాః

భాస్క : అపుత్రాః పుత్రిణ స్సంతు
పుత్రిణ స్సంతు పౌత్రిణః

ప్రభా : అధనా స్సధనా స్సంతు
జీవంతు శరదాంశతమ్॥

దయా : తథాస్తు.

(అందరు నిష్క్రమింతురు)
(తెరపడును)

సమాప్తం.